# అమ్మ - అన్న సూక్తము

- అమ్మకు ఇష్టమైన అర్చన ధాన్యాభిషేకం.
- అమ్మకు ఇష్టమైన కార్యం బిడ్డలకు అన్నం పెట్టుకోవటం.
- అమ్మకు ఇష్టమైన వాళ్లు అన్న వితరణశీలురు.
- ప్రేమసాగర అయిన అమ్మకు ఆజన్మ విరోధి బిడ్డల ఆకలి.
- అమ్మ ఆయుధాలు గిన్నెలు గరిటలు.
- అమ్మ గుండె అన్నపూర్ణాలయం.
- అమ్మ గుండె చప్పుళ్లు అన్నపూర్ణాలయంలోని గుండిగలమోతలు.
- ఇది కన్న పొట్టగాని తిన్న పొట్టకాదు.
- ఒక ఉత్సవంలో వంటవాడు అడిగాడు-అమ్మా ఏం స్వీటు చేయమంటావూ? అని. అప్పుడు అమ్మ చెప్పింది - చేసిన పదార్థం అందరికీ అందటం కంటే స్వీట్ ఏముంటుంది? అది చేయండి.
- అమ్మ సన్నిధిలో చండీయాగం చేసుకున్న యజమాని ఆ హోమ గుండంలో ఏమైనా వెయ్యమని అమ్మను అడిగితే-అమ్మ అన్నది "నేనేమి వెయ్యవలసి వచ్చినా, గాడి పొయ్యిలోనే వేస్తాను"
- అమ్మ ప్రారంభించిన అన్నపూర్ణాలయంలో ఎవరికి భోజనం పెట్టాలి? అన్న మీ మాంస వచ్చినపుడు అమ్మ ప్రవచించింది... "ద్రస్సూ, అడ్రస్సూ చూసి కాదు, ఆకలే అర్హతగా, ఆదరణే అనుపాకంగా పెట్టండి.
- అమ్మ అవతార నామం అన్నావతారం.
- అమ్మ ముద్ర-అన్నం తినమని సూచించే హస్త ముద్ర.
- నా రాశి బియ్యపు రాశి - అమ్మ

(శ్రీకొండముది రామకృష్ణ వ్రాసిన 'మాతృ సంహిత' నుండి)

కోసం తన వంటి మీద నగలు అమ్మి ఇచ్చింది. అమ్మకి బిడ్డే సొమ్ము. వారి పుండ్లు కడిగి కట్లు కట్టింది, తల్లితన పసిపాపకి వలె మలమూత్రాలు ఎత్తి పోసింది, తల్లి ఋణం తీర్చుకోలేనిది కదా!

అన్నార్తుల ఎడ అమ్మకుగల కరణారసహృదయస్పందన వాత్సల్య సంజనితము, అవధులు లేనిది. అది మానవత్వం, సానుభూతి వంటి పదాల్ని ప్రక్కకు నెట్టి అధిగమిస్తుంది ఆచరణలో. అమ్మ జగన్మాతగా గుర్తింపబడక ఒక సామాన్యగృహిణి గానే జిల్లెళ్ళమూడిలో ఉంటున్న రోజుల్లో ఒకనాడు ఒక సాధకుడు వచ్చారు. ఆలయం లేనిచోట భోజనం చేయరాదనే నియమం ఉన్నది వారికి. నాటి రాత్రి సమయంలో తెల్లని సమాధిగోడలను చూపించి, ఆలయము అని నమ్మించి వారికి అమ్మ అన్నం పెట్టింది. తెల్లవారింది. నిజం బట్టబయలైంది. ఆశ్చర్యపోయిన వారి వద్ద అమ్మ తన అసత్య వచనాన్ని అంగీకరించింది. అందువలన ఏదైనా దోషం ఉంటే ఆ ఫలితాన్ని తాను అనుభవిస్తానని, బిడ్డ ఆకలితో ఉంటే ఆ బాధ తాను భరించలేనని అమ్మ వ్యక్తపరిచింది, తన ప్రేమతత్వాన్ని. అదే అసలైన అమ్మ కడుపుతీపి స్వభావం.

అందరింటికి వచ్చిన వారెవరైనా కానీ "నాన్నా! అమ్మా! అన్నం తిన్నావా?" అనేదే అమ్మ తొలిపలకరింపు. వచ్చిన వాళ్ళకి భోజన సదుపాయాలను కల్గించటంలో అమ్మ పొందే ఆనందం తృప్తీ నిస్సీమమైనది.

"మీరు తినక పోతే చిక్కి పోతారు. మీకు పెట్టుకోకపోతే నేను చిక్కిపోతాను"- అని అమ్మ ఒకసారి చమత్కరించింది. ఆ హాస్యంలో రహస్యం ఉంది, "బాధ ఎవరిదైనా అనుభవం నాదే" అనే అమ్మ వాక్యంలో అది దాగి ఉంది. లెక్కవేస్తే అన్నపూర్ణాలయంలో 1958-2009 నడుమ కోటీ ఇరవైలక్షల మందికి, పైగా భోజనం చేసి ఉంటారని తేలికగా చెప్పొచ్చు. అన్నపూర్ణాలయంలో అన్నం తినేందుకు అర్హత ఏమిటి? "ఆకలి" అని అమ్మ విస్పష్టంగా ప్రకటించింది. కుల మత వర్ణ వర్గ లింగ విభేదరహితంగా ఎవరైనా ఆకలి వేళ అన్నపూర్ణాలయంలో ప్రవేశించి ఆ మహాప్రసాదాన్ని

స్వీకరించవచ్చు. భవసాగరాన్ని అవలీలగా దాటవచ్చు- ఎవరి అనుమతీ అవసరంలేదు. ఏకోదర బాంధవ్యంతో అందరూ అక్కడ సహపంక్తి భోజనం చేస్తారు.

ఆ ప్రసాదం ఐహిక ఆముష్మిక బంధాలనుంచి విముక్తిని ప్రసాదిస్తుంది. కనుకనే ఎందరో నానా క్లేశ విశీర్ణ జీర్ణ హృదయులు, ఆధ్యాత్మిక వన సంచారులు నిత్యం జిల్లెళ్ళమూడి ముక్తిక్షేత్రంలో ఆ ప్రసాదాన్ని స్వీకించి గట్టెక్కుతున్నారు. అంతేకాదు. అక్కడి మాతృశ్రీ ఓరియంటలో కళాశాల, మాతృశ్రీ సంస్కృత పాఠశాలల్లోని 200 మంది విద్యార్థినీ విద్యార్థులు, అమ్మ సేవ కోసం స్థిరనివాసం ఏర్పరచుకొన్న 100 మంది ఆశ్రమవాసులు, జగన్మాత ఆదరణలో కొందరు మానసిక వికలాంగులు, కొందరు నిస్సహాయులు, కొందరు నిరాధారులైన వయోవృద్ధులు.. ఉన్నారు. కనుక అన్నపూర్ణాలయ నిర్వహణకోసం చేసే ఏ సహాయమైనా (పదార్థం కానీ నగదు కానీ) ఆధ్యాత్మిక వికాసం కోసమే కాక, ప్రజోపయోగం కోసం కూడా వినియోగపడుతుంది. కనుకనే ఆస్తికులూ, నాస్తికులూ అమ్మ దివ్యమాతృప్రేమ, పరిధులులేని మానవత్వం ముందు ముగ్ధులై మోకరిల్లుతున్నారు.

## అన్నపూర్ణాలయ ప్రసాద వితరణభావనలు

తన ఆధ్యాత్మిక శిశువులకు అవతారకాలమంతా అమ్మ (జ్ఞాన) భిక్షను అందించటంలో ఎందుకు అంత శ్రమకు ఓర్చింది? అనే అంశంలో అర్థం, పరమార్థం అవగతం కావటానికి ఈ క్రింది విషయాలు దోహదం చేస్తాయి.

ఎందరో మహానుభావులు మానవతా సంస్థల ద్వారా మానవాళి క్షుధా తాపోపశమనం కోసం కృషి చేస్తున్నారు. పలుచోట్ల ఉదారులు, వితరణశీలురు అన్నదాన పావన మహాయజ్ఞాన్ని స్వచ్ఛందంగా

నిర్వహిస్తున్నారు. అక్కడ దాత చేయి పైన, లబ్ధిదారుని చేయిక్రింద స్పష్టమౌతోంది. అక్కడ కర్తృత్వ భావన ఉన్నంతసేపూ "పెట్టటం" అనే లక్ష్యం వాస్తవంగా నెరవేరదు. భౌతికంగా గ్రహీత ఆకలి మంటను చల్లార్చవచ్చు. ఒక సుప్రసిద్ధ అన్నదాన సమాజ నిర్వాహకులు అమ్మతో అన్నారు. ఇక్కడ మీరు వందల, వేలు, లక్షలమందికి అన్నదానం చేస్తున్నారు అక్కడ మేము కొద్దిపాటిమందికి పెట్టటం కష్టంగా ఉన్నది - అని. "అక్కడ మీరు పెడుతున్నాము అనుకుంటున్నారు. ఇక్కడ ఎవరి అన్నం వారు తింటున్నారు అనుకుంటున్నాను''-అని అమ్మ అలవోకగా వివరించింది సకలనిగమాగమసార అమ్మ.

అమ్మ మహావాక్యాల్లో అంతర్వాహినియై ప్రవహించే 'భావప్రశస్తి' ఇక్కడా సహజంగా సంతరించుకుంటోంది. వాస్తవానికి యాచకునిదే పై చేయి. యాచకుడు నారాయణస్వరూపుడనీ, దానం చేయుటకు దాతకు ఒక మహదవకాశాన్ని కలిగిస్తున్నాడనీ, కనుక దానధర్మాల్ని శ్రద్ధగా నిగర్వంగా చేయాలని వివేకానందులు బోధించారు.

"నీ కున్నది తృప్తిగా తిని, నలుగురికి ఆదరణగా పెట్టు, అంతా వాడే (దైవం) చేస్తున్నాడని నమ్ము" - అనే అమ్మ దివ్యసందేశము చాల సామాన్యమైనదని అనిపిస్తుంది. తరచి చూస్తే నిరహంకారత, సర్వసమానత్వం, ఆస్తిక్యత, సర్వస్వార్పణబుద్ధి, కర్మ ఫలపరిత్యాగాలకు అది దర్పణం పడుతుంది. అదే వాస్తవంగా యోగం, యాగం, తపం.

రుచికరంగా, తృప్తిగా భోజనం చేయాలనుకుంటాం. కాని ఈ ఆధునిక సమాజంలో అసంఖ్యాక వ్యాపకాలు, తాపత్రయాల నడుమ యాంత్రికజీవనం గడుపుతూ అన్నం తినటం కూడా ఒక పనే అనే ధోరణి ఏర్పడింది. బహుశ, ఈ నేపథ్యంలో అమ్మ 'నీకిచ్చింది తృప్తిగా తిను' అని బుజ్జగిస్తూ బోధిస్తోంది. జపాన్ దేశంలో 'తేనేటి పండుగ' జరుపుకోవటంలో ఆంతర్యం ఇదే; సభ్యులంతా ఆహ్లాదకరవాతావరణంలో, సమతాస్థితిలో

తేనీటి రసాస్వాదన చేయాలని. "తనివితీర తృప్తిగా పుట్టినరోజు, పెళ్ళిరోజు జరుపుకోవటం, విందు చేయటంలోని పరమార్థం" - నీ సంతోషాన్ని పదిమందికి పంచటం" అని అమ్మ వివరించింది. ఆ విధంగా నలుగురికీ ఆదరణగా పెట్టడం లో కలిగే తృప్తే ముక్తి. అసంతృప్తి నుంచి బయటపడేసేదే ముక్తి. అది త్యాగం వలనే సాధ్యం. ఈ రహస్యాన్ని వేదం 'త్యాగేనైకే అమృతత్వమానస, అని ప్రబోధిస్తోంది.

రుచిగా, శుచిగా తయారైన సాత్వికాహారం దేవునికి నివేదన చేయటం వలన ప్రసాదం అవుతుంది. ఈ ప్రక్రియలో కొన్ని మానసిక తత్వశాస్త్ర అంశాలు కూడా ఇమిడి ఉన్నాయి. వంట చేసేవారు నైపుణ్యంతో శ్రద్ధతో పాటు మంచి మనస్సుతో చేయాలి. తయారయ్యే పదార్థపు రుచి, ప్రభావం, దానిని తయారు చేసేవారి దృక్పథం మీద ఆధారపడి ఉంటుంది' - అని సెలవిచ్చారు శ్రీరామకృష్ణ పరమహంస.

అన్నపూర్ణాలయంలో వండిన పదార్థాన్ని ఆదరణ, ఆప్యాయతలతో రంగరించినపుడే రుచి వస్తుంది అని అంటుంది అమ్మ. అక్కడి అన్నప్రసాదం బాహ్యంగా శరీర పోషణని, అంతరంగా నిరవధిక ఆత్మానందానుభూతిని కలిగిస్తుంది. ప్రేమతో అన్నం పెట్టటంకాదు పెట్టుకోవటం అలవాటైతే అలా చేయకుండా ఉండలేని స్థితి వస్తుంది; ఆవ్యక్తి మూర్తిమత్వంలో ఒకభాగం అవుతుంది. అందరిలో ఉన్న 'నేను' ను సంతృప్తి పరచే మహాయజ్ఞంలా ఫలిస్తుంది. ఒకసారి సోదరులు టి.టి. అప్పారావుగారు, 'అమ్మా! నువ్వు అన్నం పెడుతూంటే, ఎంతో హాయిగా ఉందమ్మా' అని అన్నారు. అందుకు అమ్మ, "తినేవారికి ఇంత హాయిగా ఉంటే, పెట్టేవారికి ఎంతహాయిగా ఉంటుందో!" అని అన్నది. అమ్మ పొందే హాయిని ఆప్తవాక్యాలు 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అని వర్ణిస్తాయి. (అన్నంకాని, వస్త్రాలు కాని) "మీకు పెట్టటం మీ చేత పెట్టించటం కోసమే"- అని విశదీకరించింది తన శివసంకల్పాన్ని అమ్మ. వ్యక్తి తనకోసం తినటం 'రాగం' మరొకరికి పెట్టటం త్యాగం. రాగం బంధహేతువైతే, త్యాగం మోక్షహేతువౌతుంది. అన్నం

వండటం, వడ్డించటం అనే ప్రక్రియ అద్వైతరసానందానుభూతికి క్రమేణా రహదారి అవుతుంది. 1973లో అమ్మ స్వర్ణోత్సవాల సందర్భంగా ఒక్క రోజులో 1.6 లక్షల మంది ఒకే పంక్తిన భోజనం చేసిన చారిత్రాత్మక సంఘటనను ప్రస్తుతించినపుడు అమ్మ 'అంతమంది రావటమే విశేషమనీ, తినేవాడు ఉంటేనేగా ఒకరు పెట్టగలిగేది' అని సత్యాన్ని దర్శింపచేసింది. ఇక్కడ చేసేవాని భావం కీలకమైంది. జ్ఞాన ధనం, శక్తి ధనం.. ఇలా ఎన్నో ఐశ్వర్యాలుంటాయి వ్యక్తుల వద్ద. అన్నం అనేకాదు, దైవానుగ్రహలబ్ధసంపద లో కొంతభాగం నలుగురికి ఆదరణతో పెట్టమంటుంది' అమ్మ. అదే కర్మయోగం ఆచరణాత్మక సాకారరూపం. (కనుకనే 1985 మే 5న, అమ్మ కళ్యాణదినోత్సవంనాడు, అందరింటి అగ్రవర్ణాల ముత్తైదువులను, తన పరిచారక స్త్రీ లను, తనకి వైద్యం చేసే డాక్టర్‌నీ అమ్మ సమావేశపరిచింది. వారిచే గ్రామంలోని అన్ని వర్ణాల స్త్రీలను సాదరంగా ఆహ్వానించడం, బొట్టుపెట్టి కాళ్ళకు పసుపు రాసి సువాసినీపూజ చేసిన తర్వాత తృప్తిగా భోజనం పెట్టడం... క్రియాకలాపాన్ని స్వయంగా పర్యవేక్షించింది.)

## అన్నపూర్ణాలయం - నమ్మలేని వాస్తవాలు

15.8.1958 తేదీన అన్నపూర్ణేశ్వరి అమ్మచే నెలకొల్పబడిన నిరతాన్నదానశాల, అన్నపూర్ణాలయ వాస్తవాలు ఊహాతీతమైనవి, చర్మచక్షువులకు అగోచరమైనవి. నేటికీ సరైన బస్సు సౌకర్యం లేని జిల్లెళ్ళమూడి కుగ్రామంలో 50 సం॥ల క్రితం అమ్మ వెలిగించిన గాడిపొయ్యి జ్ఞానాగ్ని, యోగాగ్ని వలె నేటికిని సప్తజిహ్వలతో జ్వలిస్తూనే ఉన్నది, కోటి ఇరవై లక్షల మందికి పైగా యాత్రికులకు భోజనాన్ని సమకూర్చింది. అక్కడ జరిగేది నిత్యాన్నదానం కాదు, నిరతాన్నదానం. రాత్రి పగలు అనే తేడాలేక, డ్రెస్ అడ్రెస్‌లను పరిగణించక, కులమత వర్ణ భేదం లేక ఎవ్వరుగానీ ఎప్పుడుగానీ ఆకలే అర్హతగా అన్నప్రసాదం పొందవచ్చు. ఈ బృహత్ పథకాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తున్న శ్రీ విశ్వజననీ పరిషత్ సంస్థకు పాలీనా సమృద్ధిగా ధాన్యాన్ని సమకూర్చే పంటపొలాలు గానీ, శాశ్వత

నిధులుగానీ లేవు, మాయలేదు, మర్మంలేదు. అమ్మ వాత్సల్యగంగలో పునీతులైన అమ్మ బిడ్డలే సంస్థకు ఆస్థి. ఉదారులైన వారి విరాళాలతోనే సంస్థను నిర్వహిస్తున్నారు. ఏటా ఆదాయంకంటే వ్యయం అధికంగా ఉంటోంది. అయినా స్థానికులు, కాలేజీ విద్యార్థులు, యాత్రికుల సౌకర్యార్థం ఆవిర్భవించిన అన్నపూర్ణాలయంలో గంట నిరంతరాయంగా మ్రోగుతూనే ఉంది. ఎవరైనా ఆకలితో జిల్లెళ్ళమూడి రావచ్చు. కానీ ఆకలితో వెళ్ళరు.

అమ్మ విధానం, అన్నపూర్ణాలయ నిర్వహణవిధానం మనకు అగ్రాహ్యములే, వినయవిధేయతలతో దరి చేరితే కొంతవరకు అర్థం అవుతుంది. సంస్థ స్థితిగతుల్ని పరికిస్తే ఒకవైపు కృతజ్ఞత, మరొకవైపు ఆందోళన కలుగుతాయి. ఆశ్చర్యకరమైన సంఘటనలు కళ్ళముందు సాక్షాత్కరిస్తాయి, అవ్యక్తంగా ఉన్న అమ్మ కరావలంబం వ్యక్తమౌతుంది. కోటీశ్వరుడు సైతం ఒక్క చేతి మీదుగా ఆ సంస్థను నిర్వహించలేడు. ఒక సూర్యుడు సమస్త జీవులకు తానొక్కడై తోచు పోలిక మాదిరి అసంఖ్యాక అమ్మ సంతానంలో వెలుగొందే చిట్టిచిట్టి అమ్మల సామూహిక భాగస్వామ్యం వలన మాత్రమే అమ్మ సంస్థ నిర్వహణసాధ్యం. "మరుగే నావిధానం" అని ప్రకటించింది అమ్మ. ఆ విధంగా ఎంతగా అమ్మ తన దివ్యత్వాన్ని దాచి ఉంచినా తన జీవితంలోని అనేకానేక సంఘటనలు అమ్మ దైవత్వాన్ని చెప్పకనే చెప్పాయి. ఆ సంఘటనలు మనం గుర్తించలేనంత వైలక్షణ్యంలో కళ్ళముందే సంభవించినా మాయ తెరలు క్రమ్మి, కళ్ళు కప్పేస్తాయి. మనుష్య జనతా భాగ్యరూపిణి, మాయామానుషవిగ్రహ అయిన అమ్మ మాయ తెరల్ని కేవలం భక్తిప్రపత్తులే తొలగిస్తాయి, దైవీసంపత్తిని దర్శింపచేస్తాయి. దైవలీలల్ని అవలీలగా అవగతం చేస్తాయి.

బహుళార్థసాధకమైన విశ్వకళ్యాణకారకమైన ఒక యాగశాలగా, ప్రేమ ప్రయోగశాలగా సంకల్పించి అమ్మ అన్నపూర్ణాలయానికి రూపు దిద్దింది. కంటికి కనిపించని దైవబలమే దాన్ని నడుపుతోంది. కనిపించేదేమంటే 'అన్నదాతలంతా అమ్మకు వారసులే' అనే పరమసత్యం.

# తొలి రోజుల్లో అన్నపూర్ణాలయం

"తల్లి అంటే తరింపచేసేది" అనీ, "అడగనిదే అవసరాన్ని గమనించి పెట్టేదే అమ్మ" అనీ నిర్వచించింది ఆ అకారుణకారుణ్యరసామృత మూర్తి. అంటే సకల జీవకోటిని తన సంతానంగా ఎంచి కనడం, పోషించడం, ఉద్ధరించడం తన అవతార పరమప్రయోజనం అని చాటింది.

జిల్లెళ్లమూడి అమ్మ మెట్టిన ఊరు. అమ్మ భర్త (నాన్నగారు) శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు గారు ఆ గ్రామ కరణం. నాడు ఆ గ్రామంలో అధికశాతం జనులు నిరక్షరాశ్యులు, సన్నకారు రైతులు, రైతు కూలీలు, నిరుపేదలు; ప్రకృతి వైపరీత్యానికి, పెత్తందార్ల నిరాదారణకి గురై రోజుల తరబడి వారు పస్తులుండేవారు.

"అన్ని బాధల కంటే ఆకలి బాధ గొప్పది" అని ప్రవచించింది అమ్మ. ఆచరణలో ఆకలి మంటను చల్లార్చేందుకు 'ఆహార నిధి'ని ఏర్పాటు చేయాలని అమ్మ 1940 దశకంలో సంకల్పించింది 'స్త్రీలు రోజూ వంట చేసే ముందు ఒక గుప్పెడు బియ్యాన్ని తీసి దాచి ఒకచోట నిల్వ చేయటం; అలా పోగైన బియ్యాన్ని అమ్మ సంరక్షణలో ఉంచటం; పని, సంపాదన లేని కరువు సమయాల్లో అవసరానికి తగినంత తిరిగి తీసుకోవటం' – అమోఘమైన ఈ సూత్రం అనేకులను ఆకలి బాధ నుంచి రక్షించింది.

బాల్యం నుంచీ అమ్మలో కొందరు దైవత్వాన్ని దర్శించారు; అలౌకికమైన దివ్యానుభూతుల్ని పొందారు. అమ్మ అవ్యాజప్రేమకు విమోహితులై కొందరు అమ్మ సన్నిధికి ఆకర్షింపబడ్డారు.

ఆ రోజుల్లో అమ్మను దర్శింపవచ్చే వారికి భోజన భాజనాదులు నాన్నగారింట్లోనే. అమ్మే స్వయంగా వండి, వడ్డించేది. ఆ కుగ్రామంలో మరి వేరే వసతి లేదు.

1950 నుంచి యాత్రికుల సంఖ్య పదీ, వంద, వేయికి పెరిగింది క్రమేణా. చీరాల సోదరులు నాన్నగారి మీద భారం వేయటం ఎందుకని, వేరే వంటశాలను ఏర్పాటు చేయాలని భావించారు. కానీ నాన్నగారు ఒప్పుకోలేదు. "ఇది అతిసామాన్యమైన విషయం. రెక్కలు వచ్చిన కొడుకులు రెక్కలు రాని వాడి కోసం చేసే ఏర్పాటు. చేసుకోనీండి" - అని అమ్మ నాన్నగార్కి నచ్చ చెప్పింది. ఆయన అంగీకరించారు.

ఫలితంగా తేది 15-08-1958 రోజున అమ్మ అమృత హస్తాలతో అన్నపూర్ణాలయాన్ని స్థాపించింది. "ఇది జగన్నాథ రథం, కదిలింది. ఇక ఆగదు" అని ఆశీర్వదించింది. ఆగష్టు 15వ తేది భారతీయులకు స్వాతంత్ర్యము వచ్చిన రోజు. 'ఈ భూమి మీద ప్రతి ఒక్కరూ కడుపునిండా అన్నం తినాలి. ఎవరికీ ఆకలిబాధ ఉండకూడదు' అని అపూర్వంగా అమ్మ సంకల్పించిన రోజు.

## అన్నపూర్ణాలయ అన్నప్రసాదం:

### దేహానికి, దేహికీ సహజ పౌష్టికాహారం

బాల్యం నుంచీ అమ్మ మన లాగా ఏనాడూ ఆహారం తీసుకోలేదు. కానీ లక్షలాది మందికి కడుపు తడిమి అన్నం పెట్టింది. అదే జగజ్జనని ఏకైక వాంఛ. ఎందరో పేదలకు, అనాథలకు, ఆర్తులకు, జంతుజాలానికి స్వయంగా ప్రేమతో అమ్మ అన్నం పెట్టింది. ఆహారం అందుబాటులో లేనపుడు చేతిలో ఉన్న సొమ్ము, వంటి మీద నగలు, దుస్తుల్ని సైతం వలిచి ఇచ్చింది.

'జీవితకాలమంతా అమ్మ నిరాహారిగా ఉన్నది'- అనేది సులభంగా నమ్మలేని కఠోర సత్యం. జగన్మాతగా ఆరాధింపబడిన తర్వాత కాలంలో అమ్మ రోజుకి 1, 2 సార్లు కొద్దిపాటి కాఫీ త్రాగేది. అదీ నాన్నగారి బలవంతం మీద.









మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీ విద్యార్థులు

ఆలయంలో అర్చామూర్తి ఎదుట మాదిరి అమ్మ ముందు నివేదన ఉంచేవారు. కేవలం స్పృశించి ఒకటి, రెండు మెతుకులను స్వీకరించేది అంతే. ఆశ్చర్యం. వెంటనే తృప్తిగా భోజనం చేసినట్లు త్రేన్చేది. ఒక్కొక్క సారి ఆ పదార్థాల్ని కంటితో చూసేది. మరి చూపులతోనే నివేదనను స్వీకరించేదా? ఏమో? వాస్తవానికి మన ఆవేదనలే అమ్మకి నివేదనలు. చల్లని తల్లి అమ్మ స్పర్శతో, దృష్టితో పునీతమైన నివేదనని అన్నపూర్ణాలయంలో ప్రసాదంగా వడ్డిస్తారు. శరీరధారణకోసం సరిపడు ఆహారాన్ని తీసుకున్న సందర్భాలు అమ్మ జీవితకాలంలో చాలా అరుదు. కాగా అమ్మ శరీరంపై ఆహారానికి పోషక లక్షణం లేదు; అలాగే విషానికి సంహారక ప్రభావం లేదు.

రంగమ్మ అమ్మమ్మ (అమ్మ తల్లి) కి బిడ్డలు పుట్టటం, అచ్చిరాకపోవటం వలన అమ్మ పెంపకం బాధ్యత గొల్లనాగమ్మకు అప్పగించారు. ఎనిమిది నెలల శైశవప్రాయంలో అమ్మ పాకుతూ వచ్చి నాగమ్మ కంచంలోని మెతుకులు తినబోయింది. సాంప్రదాయబద్ధంగా అన్ని శుభకార్యాలను జరుపుకునే సీతాపతి తాతగారింట్లో అమ్మకు అన్నప్రాశన చేయలేదు. ఇంటింటా అందరికీ అన్నం పెట్టే అన్నపూర్ణేశ్వరికి అన్నప్రాశన అనవసరం అనుకున్నారా? గొల్లనాగమ్మ, ఆమె కుమార్తె సుబ్బలక్ష్మి బాలకృష్ణుని యశోదాదేవి పెంచుకున్నట్లు చిన్నారి అమ్మను పెంచారు. వారిపై ఎన్నో దివ్య విభూతులను అనుభూతులను అమ్మ వర్షించింది. వారు అమ్మను మహిమాన్విత బాలిక అని గుర్తించారు.

'అమ్మా! అనసూయా!! అన్నం తిందువుగాని రావూ?' అని చిదంబరరావు తాతగారు అమ్మను పిలిచినపుడు, "ఈ కలిలో నాకు ఆకలి లేదు" అని భావగర్భితంగా సమాధానం ఇచ్చింది. కాని అందరి ఆకలి తీర్చటానికి అమ్మ పరితపించినట్లుగా చరిత్రలో మరెవ్వరూ కానరారు.

జీవులలోని వైశ్వానరాగ్నే ఆకలి. కనుక ఆకలితో ఉన్న వారికి అన్నం పెట్టటం ఒకయాగం, ఉత్కృష్ట ధర్మం, దేవతలకి సమర్పించే హవిర్భాగం. కానీ 'అన్నదానం, అనే పదాన్ని అమ్మ సుతరామూ అంగీకరించదు.

"పిల్లలకు అన్నం పెట్టుకుంటున్నాను. ఇది దానం ఎట్లా అవుతుంది?" అని ఘాటుగా ప్రశ్నిస్తుంది. తన ప్రశ్నలో సహస్ర కోణాల దీపించే సర్వత్రానురాగాన్ని దర్శింపజేస్తుంది. ఇది అపూర్వమైన, అనన్యసామాన్యమైన, అసదృశ భావన, దీక్ష. అమ్మ విశ్వమాతృత్వ విమలానురాగాన్ని అర్థం చేసుకుంటేనే అది అవగతమౌతుంది. మనుషులేకాదు, పశు పక్ష్యాదులూ, క్రిమి కీటకాదులూ. చరాచర సకల సృష్టీ అమ్మ సంతానమే అంతటా అమ్మకి రక్తసంబంధ బాంధవ్యమే. పశువులకు దాణా వేసి అమ్మ అమితంగా ఆనందించటం మనం కళ్ళారా చూశాము.

## ఆకలే అర్హత - బేషరతుగా అందరికీ అమ్మప్రసాదం

బాల్యంలో అమ్మ ఒకసారి బంధువులతో పావులూరు గ్రామం వద్ద ఆంజనేయస్వామి గుడివద్ద మకాం చేసింది. అక్కడ కూలీలు, పనివాళ్ళూ అంతా అర్ధాకలితో అలమటించడం గమనించింది. అమ్మ వయస్సు అపుడు 10 ఏళ్ళలోపు. ఆలయంలో ప్రసాదంగా ఇవ్వబడిన పప్పులు, గింజలు రోటిలోవేసి చక్కటి చట్నీ వారి కోసం చేయాలనుకుంది. రోలు పెద్దది కావటం చేత పొత్రాన్ని పట్టుకుని తానే రోలు చుట్టూ తిరిగింది. అన్నమూ, పచ్చడీ తీసికొని అక్కడి చాకళ్ళూ, పనివాళ్ళూ... అందరికీ పెట్టి ఆనందించింది. అమ్మ చర్యను అపార్థం చేసుకున్న బంధువులు అమ్మను దూషించారు. శిక్షించారు. ఒకనాడు అమ్మ గుడిలోకి వెళ్ళి దేవునికి ఏదైనా నివేదన చేద్దామనుకున్నది. తనకు ఏమీ లభ్యం కానందున మట్టిగడ్డల్ని నివేదన చేసి, దానిని అక్కడివారికి ప్రసాదంగా పంచింది. సుగంధ పరిమళాలూ, చవులూరు రుచులతో దీపించిన ఆమట్టి ఈశ్వరి ప్రసాదమే అయింది.

సాయంసమయంలో బీదాబిక్కీ 'సంధ్యాకబళము తల్లీ!' అని ఆర్తితో భిక్ష నభ్యర్థించేవారు. ఆ ఆర్తనాదం వినబడగానే అమ్మ హృదయం చలించిపోయేది. రోజూ స్వయంగా ఎందరికో అన్నం ఆప్యాయంగా

తినిపించేది. ఎందరో తనను వారించినా, కొట్టినా, తిట్టినా లెక్కచేయక అంకాలు అనే జీతగాడికి అమ్మ ప్రేమతో ఇడ్లీ నోటికి అందించింది. అదివిన్న వెంకట సుబ్బారావు తాతగారు నిర్ఘాంత పోయారు. అమ్మ మాతృత్వ మమకార వజ్రాయుధం కులమతాల ఇనుప సంకెళ్ళను తుత్తునియలు చేసింది. అస్పృశ్యునిగా భావించబడే మంత్రాయి అనే సేవకుని కోసం తానే స్వయంగా వండి సంతోషంగా తినిపించింది. పిల్లలు, కుక్కలు, పందులను కూడా దగ్గరకు తీసికొని బ్రతిమాలి అన్నం పెట్టేది కడుపునిండ, గారం చేసి అమ్మ.

ఒకసారి ఆకలితో నకనకలాడే ఒక ముసలి భిక్షకుడు అమ్మకు ఎదురైనాడు. అమ్మ వద్ద పెట్టుకోవటానికి అన్నం లేదు. వెంటనే తన మెడలోని బంగారు తాడు, మరో ఆభరణం తీసి ఇచ్చింది. ముందు సందేహించినా అమ్మ బలవంతం మీద ఆ ఆభరణాలను తీసుకొన్నాడు. వానిని దగ్గరలోని బ్యాంకు వద్దకు తీసుకువెళ్ళింది అమ్మ. వాటిని కుదువబెట్టి సొమ్ము తీసుకున్నాడు; మద్యం త్రాగి మాంసం కొనుక్కున్నాడు. నాటి రాత్రి పాముకాటుకు గురైనాడు. మరల అమ్మ అతనిని రక్షించింది, సంరక్షించింది. అమ్మ కంటికి వ్యక్తుల అవసరాలు, వ్యక్తుల్ని దహించే బాధలు కనిపిస్తాయి. వారి దోషాలు కాదు. తన అవ్యాజానురాగాన్ని పదార్థ మాధ్యమంగా ప్రసారం చేస్తుంది అయాచితంగా అమ్మ. ఇలాంటి సంఘటనలు అమ్మ సచ్చరిత్రలో కోకొల్లలు. ఆర్తులు జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు అనబడే నాలుగు రకాల వారికి అమ్మ చేతి అన్నం ముద్ద ఒక దివ్యౌషధం, భగవతి విభూతి విశేషం.

'అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। అన్నేన జాతాని జీవన్తి। (అన్నం నుండి సకల జీవరాశులు పుట్టి, అన్నం వలననే జీవిస్తున్నాయి. కనుక అన్నం పరబ్రహ్మ స్వరూపం అని తెలుసుకోవాలి అని ప్రబోధిస్తుంది తైత్తరీయోపనిషత్. ఆర్తులకు అన్నం తినిపించటమే కానీ, తినటం తెలియదు అమ్మకు.

"మీరు తింటే నాకు ఆనందం. మీరు కట్టు కుంటే నాకు ఆనందం" అంటుంది ఆనందస్వరూపిణి అమ్మ.

అమ్మకు ఐదేళ్ళ ప్రాయంలో తల్లి రంగమ్మ చనిపోయింది. తండ్రి సీతాపతి, గ్రామకరణంగారు, వ్యవహారాల్లో మునిగితేలుతూండటం వలన అమ్మ సంరక్షణదగ్గర బంధువులకు అప్పగించబడింది. ఇరువురు పెద్దవారు మినహా అమ్మను నిజంగా ఎవరూ పట్టించుకోలేదు. పనులు మాత్రం అంతా శాసించేవారు, వంటిన ఉన్న బంగారాన్ని వదిలించారు, అనేక రకాల నిందించారు, హింసించారు.

యుక్తవయస్సులో ఒకసారి అమ్మ తన జన్మస్థలమైన మన్నవ గ్రామంలో చింతలతోపులో ఇరవైరెండురోజులు అన్నం నీళ్ళు లేకుండా గడిపింది అమ్మలో ప్రగాఢభక్తిని పెంచుకున్న మౌలాలీ అనే ముస్లిం వృద్ధుడు అమ్మకు తోడుగా ఉండేవాడు. ఆ సమయంలో భావాతీతమైన అతీంద్రియ స్థితులలోకి అమ్మ వెళ్ళేది. మౌలాలీకి దివ్యదర్శనాల్ని ప్రసాదించింది. అట్టి అలౌకిక సమాధిస్థితి నుండి వెలుపలికి రాగానే అమ్మకి మిక్కిలి దప్పిక కలిగింది. ఒక చింతచెట్టు వైపు నిశితంగా చూసింది. ఓంకార శబ్దం చేస్తూ ఆ వృక్ష కాండం విరిగింది. అందుండి పాతాళగంగలా చింతరసం పెల్లుబికి అమ్మ దాహాన్ని తీర్చింది. ఆశ్చర్యంగా అదే సమయంలో ఆకాశంలో మేఘాలు క్రమ్ముకొని, ఆ ఋతువులో తొలిసారిగా కుంభవృష్టి కురిసింది.సలసల కాలిన పుడమిపై తొలకరి జల్లులు పడగా జంతు వృక్ష సంపద పులకరించి పునరుద్భవించింది. సుదీర్ఘమైన స్వీయ ఉపవాస దీక్షానంతరం అమ్మ తేరుకొని అక్కడక్కడి పళ్ళను సేకరించి మౌలాలీ కడుపునింపింది. అమ్మకి పరమార్థమే స్వార్థం.

విశ్వమానవ క్షుధాగ్ని కీలలే అమ్మ హృదయసాగర బడబాగ్ని శిఖలు. గుంటూరులో కుగ్లర్ హాస్పిటల్‌లో కొన్ని వారాల పాటు అమ్మ ఉండాల్సి వచ్చింది. అక్కడి నిరుపేదలకు, వ్యాధిగ్రస్తులకు మందులు పథ్యపానాదుల

అంఆ

# అన్నపూర్ణాలయం

## అమ్మ అనసూయా దేవి అద్భుత సృష్టి




ఆంగ్లమూలం : **ఎస్. మోహనకృష్ణ**

స్వేచ్ఛానువాదం : **ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం**

**అన్నపూర్ణాలయం**

**అమ్మ అనసూయాదేవి అద్భుత సృష్టి**

తెలుగులో
ప్రథమ ముద్రణ

వికృతి నామ సంవత్సర వసంత నవరాత్రులు
(మార్చి 2010)

వెల : 20/-
కాపీలు : 1000

డిజైన్/ముద్రణ:
జనని విజువల్ కమ్యూనికేషన్స్

ప్రచురణ : శ్రీ విశ్వజననీ పరిషత్
ప్రతులకు : జిల్లెళ్ళమూడి – 522 114.
గుంటూరు జిల్లా
ఆంధ్రప్రదేశ్

# అన్నపూర్ణాలయం అమ్మ వజ్రసంకల్పం

- శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు
పాట్రన్, శ్రీ విశ్వజననీ పరిషత్

అమ్మ తన చిన్నప్పుడు సర్వులకూ స్వతంత్రమైన సత్రమూ, దేవాలయం లేని ఊళ్లో దేవాలయమూ ఏర్పాటు చేయాలనుకున్నదని మీరు చదివినట్లే నేను అమ్మ మహోదధిలో చదివాను. అమ్మకు వచ్చిన ఆ సంకల్పం వజ్రసంకల్పం. ఎందుకంటున్నానంటే అది జరిగింది కనుక. అమ్మ అన్నదల్లా జరిగిందా అంటే నా అనుభవంలో జరగనివి కూడా ఉన్నాయి. సంకల్పం జరిగితే భవిష్యత్తు తెలిసిన వారని అనుకుంటాం. అమ్మ అన్నమాటలే చూడండి.

"నేను భవిష్యత్తు అని చెప్పటం లేదు. నాకు భవిష్యత్తు తెలుసునని కూడా అనుకోవటం లేదు. కాకపోతే నేను గతంలో అన్నది నేడూ, నేడన్నది రేపు కార్యరూపం ధరించవచ్చు. ఉదాహరణకు 1960కి పూర్వం మన ఇంట్లో కూర్చుంటేనే ఏడవమైలు నుండి వచ్చే వాళ్ళు కనిపిస్తే ఎంత బాగుంటుంది అనుకున్నాను. నేడది నిజమయింది. మొన్న పాలకొల్లు గోపిని చూడాలనుకున్నాను. నిన్న గోపీ వచ్చి మొన్నటి దాకా రావాలనే ఉద్దేశ్యం లేదు. హఠాత్తుగా బయలుదేరి వచ్చాము అన్నాడు. దీన్ని మీరు భవిష్యత్ జ్ఞానం, వాక్శుద్ధి, సంకల్పసిద్ధి అనవచ్చు. మీ ఇష్టం. నేను మాత్రం తెలిసీ ఆలోచించి ఏదీ అనను. ఆ మాటకు వస్తే మీరనుకొనేవి మాత్రం కొన్ని నిజం కావటం లేదూ? నేనన్నవి మాత్రం అన్నీ నిజమవుతున్నాయా?" అన్నది అమ్మ.

నేనందుకే అంటుంటాను అమ్మ చెప్పింది కాదు చేసిందే నమ్ముతాను అని. నా విషయంలో అమ్మ చైతన్య ఉపనయనం టి.టి.డి. కళ్యాణ మండపంలో మొదటిది చేద్దాం అన్నది. అమ్మ చెయ్యలేదు అయితే టి.టి.డి. కల్యాణమండపంలో జరిగింది. అది వేరే విషయం.

అన్నపూర్ణాలయం విషయం అలాకాదు. అమ్మ చిన్నప్పుడే సంకల్పించింది. దానిని నెలకొల్పింది. "అవతార వ్యక్తి కూడా సంకల్ప సహితుడే అన్నది అమ్మ." అయితే అమ్మ "నాది తోలునోరు కాదు కదా! తాలుమాట రావటానికి" అన్నది. అమ్మ అవసరానికి అనుగుణంగా ఎదుటివాళ్ళను సంతోషపెట్టటానికి కొన్ని మాటలు చెప్పవచ్చు. కాని అన్నీ జరుగతయ్యని నేననలేదు. అట్లా అని అన్నీ జరుగలేదని చెప్పలేను. అలా జరిగిన విషయాలు నా జీవితంలో కూడా ఉన్నాయి. అన్నపూర్ణాలయం విషయంలో మరీనూ.

నా చిన్నప్పుడు పూండ్ల నుండి 'యల్లమంద' భజన చేయటానికి వచ్చేవాడు. అతనితో కొందరిని తెచ్చేవాడు. అమ్మ ఆ రోజు ఒక కాఫీ కప్పు బియ్యం పోసి అన్నం వండింది. అమ్మతో నేను గట్టిగా తింటే అది నాకే సరిపోదు కదమ్మ! ఇంతమంది వచ్చారు ఎట్లా? అన్నాను. 'నీకు కావలసినంత నీవు తిను నాన్నా!' నేను చూసుకుంటానుగా" అన్నది. నిజమే అమ్మే చూసుకొన్నది. అదే అందరికీ సరిపోయింది.

ఏ పండుగ రోజునైనా అమ్మ వచ్చి అన్నపూర్ణాలయంలో అన్నపురాశికి హారతిస్తే అది ఎంతమందికైనా సరిపోయిన సంఘటన లెన్నో ఉన్నాయి. అమ్మ స్వర్ణోత్సవంనాడు కూడా గోపాలన్నయ్య వాళ్ళు వచ్చిన జనాన్ని చూచి బాపట్ల పోయి బియ్యం బస్తాలు కొనుక్కొని రావాలని బయలు దేరుతుంటే అమ్మ మీ మొఖం. జనాన్ని చూచి బియ్యం కొనుక్కొని రావటమేమిటిరా? నేనొస్తున్నాను పదండి అని అమ్మ వచ్చి అన్నపురాశికి హారతిచ్చి ఇక వడ్డించండి అన్నది. లక్షమందికే సరిపోదనుకున్నది లక్షాఅరవై వేలమంది తినగా, మిగిలింది పశువులకు, పక్షులకు క్రిమికీటకాదులకు జలచరాలకు సైతం పెట్టించింది.

రూపంలేని అమ్మ రూపం ధరించింది కదా! అమ్మ రెండు లేవు అంటున్నా గృహిణిగా తన బాధ్యతలు నెరవేర్చింది. ఒక అతీతశక్తిగా ఎన్నో కార్యక్రమాలు నిర్వహించింది. వాటినీ వీటినీ రెండింటినీ చూచాను నేను. అమ్మ నిజంగా సంకల్పిస్తే జరగకపోవటం లేదు. దానికి కూడా హైమాలయం వంటివి ఎన్నో ఉదాహరణ లివ్వగలను. అన్నపూర్ణాలయం కూడా అటువంటి అమ్మ వజ్రసంకల్పాలలో ఒకటి.

సోదరుడు శ్రీ మోహనకృష్ణగారు నన్ను నాలుగు ముక్కలు వ్రాయమంటే ఇదంతా వ్రాయాల్సివచ్చింది. అన్నపూర్ణాలయం విషయంలో మోహనకృష్ణ గారు వ్రాసిన విషయాలు సర్వులకు అనుభవంలో ఉన్నవే. ఆదరణ అప్యాయతతో పెట్టే ఏ యిల్లైనా అన్నపూర్ణాలయమే నని మనందరిళ్లు అలా కావాలనీ అమ్మ ఆకాంక్ష. శ్రీ మోహనకృష్ణ ఈ పుస్తకంలో అమ్మ చూపించే వాత్సల్యానికి రూపుదిద్దిన ఆనాటి ఛాయాచిత్రాలతో రూపుదిద్దుకోబోయే అన్నపూర్ణాలయ నూతన భవన నమూనా చిత్రాన్ని కూడా అందించటం బాగున్నది. మోహనకృష్ణతో పాటు ఈ గ్రంథాన్ని అనువదించిన శ్రీ ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం గారికి, వెలుగు చూడటానికి సహాయపడ్డ సోదరులకు సంస్థ నిర్వాహకులకు నా అభినందనలు, కృతజ్ఞతలు తెలియజేస్తూ అమ్మ ఆశీస్సు వారికి ఎల్లప్పుడూ ఉండాలని అమ్మను ప్రార్థిస్తున్నాను.

# 'అన్నదా' అక్షయ పాత్ర

"అన్నపూర్ణాలయం నా గుండె నాన్నా!" "నేను ఏమైనా వేసుకోదలిస్తే గాడిపొయ్యిలోనే వేసుకుంటా". అన్నది జిల్లెళ్ళమూడి అమ్మ. గాడి పొయ్యే అమ్మకు హోమగుండం, బిడ్డలకు అన్నం పెట్టడమే ఆమె మహా యజ్ఞం.

అమ్మ జన్మదిన స్వర్ణోత్సవాల సందర్భముగా 12-4-1973 తేదీన ఒక్క పంక్తిన ఒక లక్షా అరువది వేల మందిని కూర్చోబెట్టి అన్నం వడ్డించిన మహాతల్లి జిల్లెళ్లమూడి అమ్మ. ఆ దృశ్యాన్ని చూసి పులకరించి "ఒక పంక్తిన లక్ష మందికి బువ్వపెట్టిన అందరమ్మకు .... " అని గొంతెత్తి పాటుకున్నారు నదీరా !

1958 ఆగష్టు 15 తేదీ వరకు అమ్మ తనను చూడడానికి వచ్చిన బిడ్డలందరకూ తనే వండి వార్చి పెట్టేది. వందల సంఖ్యలలో సోదర సోదరీమణులు అమ్మ దర్శనానికి వస్తున్నందున చీరాల సోదరులు "అన్నపూర్ణాలయం" ఏర్పాటుకు అమ్మ అంగీకారాన్ని పొంది ఆగష్టు 15న "అన్నపూర్ణాలయం" ఏర్పాటు చేశారు. ఆనాటి నుండి ఈనాటి వరకు అమ్మ కరుణతో కోట్లాది మంది భోజనం చేస్తున్నారు. అది ఒక జగన్నాథ రథం అన్నారు అమ్మ.

"అన్నంబ్రహ్మేతివ్యజనాత్। అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। అన్నేన జాతాని జీవంతి। అన్నం ప్రయంత్యభి సంవిశంతేతి॥" అన్నమును బ్రహ్మముగా తెలుసుకొనెను, అన్నము నుండి యే జీవ దేహములు నిజముగా పుట్టుచున్నవి, అన్నము చేతనే జీవించుచున్నవి. మరణించిన తరువాత అన్నమునందే లయించుచున్నవి" అని తైత్తరీయో పనిషత్తు ప్రవచించుతుంది.

అంతేకాక "అన్నం ననింద్యాత్ తద్ వ్రతమ్" "అన్నంన పరిచక్షీత। తద్వ్రతమ్॥" "అన్నం బహుకుర్వీత। తద్వ్రతమ్" అని తైత్తరీయో పనిషత్తు.

అమ్మ వేద స్వరూపిణి. కనుకనే అమ్మ అన్న ప్రసాదమును తన బిడ్డలందరకూ ఆప్యాయతతో పెట్టి, మనల్ని కూడ "మీ కున్నది తృప్తిగాతిని, ఇతరులకు ఆదరంగా పెట్టుకోండి నాన్నా ! "అని సందేశమిచ్చారు. మనం మనకున్నదానిని ఇతరులతో ఆనందంగా పంచుకు అనుభవించే 'భూమ విద్య'ను బోధించినది.

జిల్లెళ్లమూడిలో అమ్మ పెట్టిన ఈ ఒరవడిని తిరుమలలో, శ్రీశైలంలో, అన్నవరంలో ఇతర పుణ్య క్షేత్రాలలో కూడా విస్తృతంగా ఆచరిస్తున్నారు. అందుకే అన్నపూర్ణాలయం అమ్మ (అన్నదా) చేతిలోని అక్షయపాత్ర.

జిల్లెళ్లమూడిలో అన్నపూర్ణాలయం ఘనచరిత్రను ఈ చిన్ని పుస్తకములో విపులంగా వివరించారు. సోదరులు శ్రీ ఎస్. మోహనకృష్ణ, శ్రీ ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం గారలు. వారిద్దరికి అమ్మ ఆయురారోగ్యములు ప్రసాదించాలనీ, ఇలాంటి పుస్తకములను వెలుగులోకి తీసుకురావాలని ఆకాంక్షిస్తూ.

అమ్మ సేవలో
భవదీయుడు
**బొప్పూడి రామబ్రహ్మాము**
అధ్యక్షులు
శ్రీ విశ్వజననీ పరిషత్

# అన్నపూర్ణాలయం - అమ్మ అద్భుత సృష్టి

**అమ్మ అంటే:-**

జిల్లెళ్ళమూడి అనేది ఒక చిన్న గ్రామం. అది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గుంటూరు జిల్లా బాపట్ల దగ్గర ఉన్నది. అక్కడ కర చరణాదులతో కనువిందు చేసే మధుర మమతామృత మాతృమూర్తి. మానవ రూపంలో కొలువై ఉన్నది.

ఆమె పేరు "అనసూయ". మాతృశ్రీ అనసూయాదేవిగా ప్రసిద్ధి చెందింది. కానీ అందరూ మనసారా "అమ్మా" అని పిలుస్తారు. కట్టు బొట్టు, గాజులూ మంగళసూత్రాలూ, మట్టెలూ చూడగానే ఆమె ఒక సామాన్య గృహిణి అనిపిస్తుంది. కానీ ఆ తల్లి ఉనికి ఒక అలౌకిక ఆనందాన్ని కలిగిస్తుంది. కనీ వినీ ఎరుగని ఒక దివ్య వాతావరణాన్ని తలపిస్తుంది. అమ్మదృక్కులు దిగ్దిగంతాలకు వ్యాపించి ఉంటాయి. పలుకులు నిగమాగమ సారాన్ని రంగరించి పోస్తాయి; నడతలు విశ్వరూప సందర్శన భాగ్యాన్ని అనుగ్రహిస్తాయి. ఆ మూర్తి దర్శనం పురాకృత పుణ్యఫలం, పాపహరం, సర్వార్థ దాయకం.

దశాబ్దాలుగా దేశవిదేశాలనుండి అసంఖ్యాకులు అనునిత్యం అరుదెంచి అమ్మను దర్శించి తమ ఆవేదనలను నివేదించి తమ సమస్యలకు పరిష్కారాల్నీ ఐహిక ఆముష్మిక సౌఖ్యాల్ని పొందుతున్నారు. తమ ఆప్తబాంధవిగా ఇలవేలుపుగా ఆరాధిస్తున్నారు; కంటివెలుగుగా కరుణారస సింధువుగా దర్శిస్తున్నారు; ఆ మాతృమూర్తి చల్లని వడిలో సేదదీరుతున్నారు. ఆస్తి, ఆస్తిక్యత ఉన్నవారికీ లేనివారికీ అమ్మ ఆదరణ ఆప్యాయతల వృష్టి అమృతాభిసేచనమే.

ఆ దివ్య మాతృమూర్తి దృష్టిలో దుష్టులూ శిష్టులూ అనే భేదం లేదు; అందరూ విశిష్టులే. అక్కడ పాలన లేదు. అంతా లాలనే. అక్కడ దండన లేదు, అంతా బుజ్జగింపే. తనకు భూత భవిష్యత్ వర్తమానాలూ లేవు. అంతా వర్తమానమే. ఆద్యంతాలు లేని మూల ప్రకృతి; చరాచర భేదరహితంగా సకల సృష్టికి తొలి అయిన తల్లి. అమ్మ పావన సన్నిధిలో సాధనలేదు; అమ్మను దర్శించటమే (సాధ్యాన్ని) పొందటం. మనుషులూ, జంతువులూ, పశుపక్ష్యాదులూ క్రిమికీటకాదులూ అందరూ, అన్నీ అమ్మ దృష్టిలో కన్నులు తెరవని పురిటి బిడ్డలే.

అమ్మ 1985 జూన్ 12వ తేదీన తనువు చాలించింది. అమ్మ భౌతిక దేహం అనసూయేశ్వరాలయంలో నిక్షిప్తం చేయబడింది. 1987లో నల్లని శిలతో రూపొందిన అమ్మ విగ్రహం అచట ప్రతిష్ఠింపబడింది.

భౌతికకాయం విడిచి వెళ్లిన తర్వాత తాను అందరికీ మరింత అందుబాటులో ఉంటానని అమ్మ తన మహా సమాధికి ముందే సూచించింది. అమ్మ ఎక్కడికీ వెళ్లలేదనీ, శివమూర్తియై వందారు జనవత్సలగా ఆర్తులను ఆదుకుంటున్నదని, జిజ్ఞాసువులకు మార్గదర్శనం చేస్తున్నదనీ, జిల్లెళ్లమూడిని దర్శించే లక్షలాది ప్రజలు విశ్వసిస్తారు. అందుకు నిదర్శనాలు కోకొల్లలు.

అమ్మ సంకల్పంతో స్థాపించబడిన అన్ని సంస్థలూ దినదిన ప్రవర్ధమానమవుతూ అమ్మ శిశుకోటికి ఆలంబనగా పరిపుష్టిని సంతరించుకోవటం అమ్మ దివ్య ప్రణాళికలో భాగమని, అందునా అసంఖ్యాక ప్రజానీకానికి అన్న ప్రసాద వితరణ గావిస్తున్న అన్న పూర్ణాలయం అమ్మకు ప్రతిరూపమేననీ జిల్లెళ్ళమూడి సందర్శకులు అనుభవపూర్వకంగా తెలుసుకుంటారు.

డా॥పాపక్కయ్య ప్రయత్నిస్తోంది. అన్నపూర్ణాలయానికి తనకీ ఉన్న తాదాత్మ్యస్థితిని గుర్తింప జేస్తూ అమ్మ, "అన్నపూర్ణాలయానికి సెలైన్ పెట్టటానికి ఆలోచిస్తున్నారా!" అని అడిగింది.

తిరుమల తిరుపతికి వచ్చీపోయే యాత్రీకులకందరికీ ఉచితభోజనం ఏర్పాటు చేస్తే బాగుంటుంది అని అమ్మ కోరుకున్నది. అచిరకాలంలోనే తిరుమల, అన్నవరం, విజయవాడ (దుర్గమ్మ), దేవస్థానాల్లో ఉచిత భోజనకార్యక్రమం ప్రారంభమైంది.

శ్రీశైలం వద్ద హాటకేశ్వరంలో పరమపూజ్య శ్రీశ్రీశ్రీ పూర్ణానంద స్వామీజీ 1990 సం॥ము నవరాత్రులనుండి తన ఆశ్రమవాసులకేకాక వచ్చీపోయే యాత్రీకులకు కూడా అన్నప్రసాద వితరణపథకాన్ని విస్తరింపజేశారు. స్వామిజీ శిష్యులువారిని శివస్వరూపంగా పూజిస్తారు. స్వామీజీ అమ్మను గురించి, 'అమ్మ అంటే ఆది. మహోజ్జ్వలశక్తి స్వరూపం. తల్లిలేని శివుడు అమ్మలో తన తల్లిని కనుగొన్నాడు' అది అభివర్ణించారు. తమ ఆశ్రమంలో జీవకళ ఉట్టిపడే నిలువెత్తు అమ్మ ఫోటోని ప్రతిష్ఠించి అన్నపూర్ణాలయాన్ని స్థాపించారు. త్రికరణశుద్ధిగా అమ్మసందేశాన్ని ఆచరణాత్మకంగా ప్రబోధించే అమ్మ ముద్దు బిడ్డ, మహాతపస్వి, సర్వసంగపరిత్యాగి, యోగి.

## అన్నపూర్ణాలయం - అందరికోసం

జిల్లెళ్ళమూడిలోని తన నివాసగృహానికి అమ్మ 'అందరిల్లు' అని నామకరణం చేసింది. అమ్మను దర్శింప, సేవింప వచ్చే పోయేవారికి ఉచిత భోజన వసతి సదుపాయాలను కలిగించడానికి ఆ భవనం ఉద్దేశింపబడింది. సర్వులకీ స్వతంత్రమైనది ఆ ఇల్లు. ఎవరైనా అందరింటి ప్రాంగణంలో అడుగుపెట్టగానే వారికి శ్రవణానందకరంగా వినిపించేది 'అన్నయ్యా! అక్కయ్యా!' అనే అనురాగ భరిత పిలుపులు, రక్త సంబంధ బాంధవుల

పలకరింపులు. జిల్లెళ్ళమూడి రాగానే మరోలోకంలో అడుగు పెట్టినట్లుంటుంది. శాంతిని, సంతృప్తిని ప్రసాదించే ఆ వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. యాదృచ్ఛికంగా జిల్లెళ్ళమూడి వచ్చినా ఆయాత్ర శుభఫలప్రదము అవుతుంది. అమ్మని దర్శించుటయే అమ్మను పొందటం.

భోజనానికీ వసతికీ, అర్చనకీ అభిషేకానికీ, విద్యకీ వైద్యానికీ... దేనికీ సొమ్ము చెల్లించనక్కరలేదు. అక్కడ ఎవరిపని వారికి ఉంది. ఎవరికి వారు బాధ్యతనెరిగి ప్రవర్తిస్తారు. నాస్తికులు, నిత్యశంకితులు, నిరాశావాదులు సైతం అందరింటిని, అన్నపూర్ణాలయాన్ని (సామాజిక వంటశాల) ఆదర్శప్రాయమని వేనోళ్ళ ప్రస్తుతించారు. అమ్మలో దైవీ సంపత్తిని చూసి కొందరు, పరిపూర్ణ మానవత్వాన్ని చూసి కొందరు, బాధితుల ఎడ కరుణారసభరిత హృదయస్పందనను చూసి కొందరు, అవ్యాజప్రేమామృతరస వృష్టిని చూసి కొందరు... అశేషజనవాహిని అమ్మవైపు ఆకర్షించబడింది.

ఇటీవల గుంటూరు జిల్లాలోని రేపల్లె, పరిసరగ్రామాలు వరద తాకిడికి బలై, ప్రకృతివైపరీత్యానికి తలక్రిందులైనపుడు బాధితులను ఓదార్చి శ్రీ విశ్వజననీపరిషత్, జిల్లెళ్ళమూడి, ఆహారం, దుస్తులు, వంట సామగ్రి పంపిణీచేసి ఆదుకున్నది. జైళ్ళు, వృద్ధాశ్రమాలూ, కుష్ఠురోగులు - వికలాంగుల పునరావాస కేంద్రాలూ, ఆస్పత్రులను, బాలకార్మికులైన వీధిపిల్లలను సందర్శించి గుంటూరు, పొన్నూరు, గన్నవరం, బాపట్ల, హైదరాబాద్... పలుప్రాంతాల్లో అన్నప్రసాద వితరణశిబిరాలను నిర్వహించింది శ్రీ విశ్వజననీపరిషత్.

## అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవాలు

'నీవు భూమిపై నిలిచిన తరినే జీవించితి, కడుధన్యుడనమ్మా' అని స్తుతించారు, పరవశించారు సో॥ శ్రీ యార్లగడ్డ రాఘవయ్యగారు. భూమిపై



చెవిటి, మూగ పాఠశాల, స్టూవర్ట్‌పురంలో భోజన వితరణ



అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవాలలో అన్న వితరణ - అప్పికట్ల గ్రామం

అమ్మ నడయాడిన అవతార కాలంలో లక్షలాది మంది అమ్మను దర్శించుకున్నారు. సంసారబాధలు, శారీరక రుగ్మతల నివారణ, సుఖసంతోషాలు, ధన ధాన్యసమృద్ధికోసం అమ్మను ప్రార్థించారు. సహానుభూతితో అమ్మ వారి వెతలను, వ్యధలను ఆలకించి కుంకుమ పొట్లాలు ప్రసాదంగా ఇచ్చేది, అన్నపూర్ణాలయానికి వెళ్ళి అన్నంతినమని ప్రతి ఒక్కరిని కోరేది. వారి మనోభీష్టాలను నెరవేర్చటానికి కామధేనువులా, కల్పవృక్షంలా అన్నపూర్ణాలయాన్ని తీర్చిదిద్దింది. వారు కోరినవికాక, వారికి అవసరమైన వాటిని అనుగ్రహించేది. అక్కడ పచ్చడి మెతుకులు తిన్నవారి జీవితాలు పచ్చగా కళకళలాడుతాయనేది అనేకుల అనుభవం. ఆ విధంగా నేటికీ అమ్మ అనుగ్రహవర్షం అక్కడ కురుస్తోంది అందరిపై తరతమభేదం లేక. అమ్మను దర్శించుకొని అన్నపూర్ణాలయ ప్రసాదం స్వీకరించిన వారికెందరికో జీవితంలో కలిసివచ్చి అష్టైశ్వర్యాలతో, అనేక శుభాలు, లాభాలు పొంది ఆనందంగా జీవిస్తున్నారు. అమ్మ సందేశాన్ని ఆత్మీయతతో ఆచరణలో పెడుతున్నారు.

అన్నపూర్ణాలయం 15.8.1958 తేదీన అమ్మ స్వహస్తాలమీదుగా ప్రారంభించబడి 15.8.2008 తేదీనాటికి 50 సం॥లు నిరతాన్న వితరణకార్యక్రమాన్ని నిర్విఘ్నంగా జగత్కళ్యాణకారకంగా నిర్వహిస్తున్న శుభతరుణాన 15.8.07 - 15.8.08 సంవత్సరాన్ని అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవాల నిర్వహణకి సంకల్పించారు. అసంఖ్యాక సోదరీ సోదరులు అమ్మకు ప్రీతిపాత్రమైన అన్నప్రసాద వితరణకార్యక్రమాన్ని దేశవిదేశాలలో 90కి పైగా వేర్వేరు ప్రాంతాల్లో నిర్వహించి ప్రేమపూర్వక నమస్సుమాంజలులను అమ్మకు సమర్పించారు. ఈ కార్యక్రమాల్లో గ్రామ పట్టణప్రజలు కులమతాలకు అతీతంగా అత్యుత్సాహంగా పాల్గొని జయప్రదం చేశారు. శ్రీ విశ్వజననీపరిషత్ వందలాది జిల్లెళ్ళమూడి గ్రామ ముస్లిం సోదరులకు 'రంజాన్ విందు' ను ఇచ్చి ఆదరించి ఆనందించింది. దశాబ్దాలుగా రేయింబవళ్ళు మధురమధురంగా ఆర్తితో జపించే అమ్మనామ



అన్న వితరణ - మన్నవ గ్రామం ( అమ్మ జన్మస్థలం )



తెనాలి సబ్ జైలులో అన్న ప్రసాద వితరణ

(జయహోమాతా శ్రీ అనసూయా రాజరాజేశ్వరి శ్రీ పరాత్పరి) ద్రష్ట ఇమామ్ అనే ముస్లిం సోదరుడు.

## అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవాల సందర్భంగా వందల కోట్ల శ్రీ లలితా సహస్రనామ పారాయణ

బాల్యంనుంచీ అమ్మలోని సహజ ఆధ్యాత్మిక దివ్యప్రసారానికి ఆబాలగోపాలము, పండితులు, పామరులు, భక్తులు,.. ఎందరో 'ధన్యోస్మి' అని పులకరించారు. ప్రేమ, కరుణ, ఆనందము మూసపోసిన మధుర మనోజ్ఞమూర్తి అమ్మ అందరి హృదయాల్లో అందరి అమ్మగా సుప్రతిష్ఠిత అయింది. అమ్మ హైమ అక్కయ్యతో ప్రారంభించి, మనందరిచేత శ్రీలలితాసహస్రనామ పారాయణలు అనేకసార్లు చేయించింది. చేయిస్తోంది. "అమ్మయే లలిత, లలితయే అమ్మ" అని ఉద్బోధించారు. శ్రీ లక్ష్మణ యతీంద్రులు.

స్తోత్రరాజమైన శ్రీ లలితాసహస్ర నామాల్లో కీర్తించబడిన సకల కళ్యాణగుణరాశియే అమ్మ. కనుక అనేకులు అమ్మను శ్రీ లలితా పరమేశ్వరి అని ఆరాధిస్తారు. అమ్మ నామపారాయణప్రీత. మొదటిసారి అమ్మ శ్రీచరణసన్నిధిలో సో॥ రాచర్ల లక్ష్మీనారాయణనడుంబిగించి శ్రీలలితా కోటినామ పారాయణకు సారథ్యం వహించారు. అదేవిధంగా శ్రీ హైమవతీ దేవి పుట్టిన రోజు సందర్భంగా ఏటా శ్రీలలితా కోటి నామపారాయణ చేయటం మన సంప్రదాయం. అన్నపూర్ణాలయ స్వర్ణోత్సవ సందర్భంగా జిల్లెళ్ళమూడి కేంద్రంగా అనేక ప్రాంతాల్లో అన్యోన్య సహాయంతో అమ్మబిడ్డలు 100 కోట్లు నామ పారాయణచేయాలని ప్రారంభిస్తే 200 కోట్లు దాటి జరగటం నిస్సందేహంగా జగత్కళ్యాణకారక అమ్మ ఆశీఃప్రభావమే. అన్నపూర్ణాలయం కార్తీక దీపం వలె సకల శుభకరమైన విశ్వజనని విశ్వశ్రేయ, కామన స్పందనల్ని, మానవాళి అభ్యున్నతి కోసం, సదా సహస్రకోణాల ప్రసరిస్తోంది.



అన్నపూర్ణాలయములో రంజాన్ విందు



## అమ్మ వాక్యాలు - జ్ఞాన గుళికలు :

1. తల్లి అంటే తొలి.
2. మీ అందరినీ నేనే కన్నాను,
మీ తల్లులకు పెంపుడిచ్చాను.
3. దైవం సృష్టిని చేయడం కాదు, సృష్టే దైవం.
4. మీరు నా బిడ్డలే కాదు, నా అవయవాలు.
5. అంతటా ఉన్న అమ్మ తెలియటానికే ఈ అమ్మ.
6. సర్వాన్నీ అనుభవిస్తూ, సర్వాన్నీ విడిది పెట్టేదే వివాహం.
7. నన్ను చూడటమే పుణ్యం.
8. తల్లి అంటే తరింపచేసేది.
9. సుఖానికి మార్గం ఒకటే – ఏది చేసినా దైవం చేశాడనుకోవటమే.
10. రాగద్వేష అసూయలను పారద్రోలేదే అనసూయ.
11. అడగనిదే అవసరాన్ని గమనించి పెట్టేదే అమ్మ.
12. మీకు పెట్టటం మీ చేత పెట్టించటం కోసమే.
13. భ్రాంతి లేని వాక్యం బ్రహ్మ వాక్యం.
14. పరిమితమైన మమకారం మానవత్వాన్నీ, సర్వత్రా ఉండే మమకారం మాధవత్వాన్నీ గుర్తింపచేస్తుంది.
15. ఉలిదెబ్బలతో శిల్పం సౌందర్యవంతం అయినట్లు, బాధలు జీవితాన్ని చైతన్యవంతం చేస్తాయి.
16. మానవుని నడకకి ఆధారం నవగ్రహాలు కాదు, రాగద్వేషాలు; వాటికి ఆధారం 'నేను'.
17. తిధులు విధిని మార్చలేవు.
18. సర్వత్రా అనురాగమే విరాగం.
19. శరీరం ఆత్మ కాకపోలేదు.
20. భార్యకు భర్త దేవుడు, భర్తకు భార్య దేవత.
21. మీరు తినక పోతే నేను చిక్కిపోతాను.

# జిల్లెళ్ళమూడి దేవాలయములోని విగ్రహాలు




అమ్మ అనసూయా దేవి



హైమవతీ దేవి




నవ నాగ నాగేశ్వర స్వామి




వరసిద్ధి వినాయక స్వామి

అన్నయ్య ఈ సారి సరైన నిర్ణయం చేశారు తక్షణం జిల్లెళ్ళమూడి తీసుకురావాలని. ఆశ్చర్యమేమంటే దీర్ఘకాల ఉపవాసానంతరం సోదరికి హైదరాబాద్ నుంచి జిల్లెళ్ళమూడి ప్రయాణచేసే ఓపిక ఉన్నది. అన్నయ్య, వారి తల్లి, సోదరి రుక్మిణి, వారి అక్కయ్య అంతా ప్రయాణమై రైలులో బాపట్ల వచ్చారు. జిల్లెళ్ళమూడి సంస్థ వాన్ మరమ్మతులో ఉంది టాక్సీలు అందుబాటులో లేవు ఎన్నికల హడావిడిలో ఉన్నాయి. రెండు రిక్షాలపై జిల్లెళ్ళమూడి వచ్చారు. జిల్లెళ్ళమూడి రాగలగటం కష్టం. అదే సాధన. వచ్చాక అంతా ఆనందమే. రావటమే తడవుగా అమ్మ దర్శనం ఇస్తోందని తెల్సి వేగమే వెళ్ళి వరుసలో అసీనులయ్యారు. తమ వంతు అర్చన వచ్చింది. సోదరి నిస్సహాయ శారీరక స్థితిని, నిష్ఫలప్రయత్నాల్ని అమ్మకు నివేదించారు. అనుగ్రహస్వరూపిణి అమ్మ సోదరిని దగ్గరకు తీసికొని ఆప్యాయంగా తల, వీపు నిమురుతూ, “అమ్మా! కొంచెం మజ్జిగ త్రాగుతావా?” అని ప్రశ్నించింది గోముగా. సోదరి అంగీకారసూచకంగా తల ఊపింది. తత్వత:సామూహిక శారీరక వ్యవస్థని యధాస్థితికి రమ్మని ఆదేశించిందేమో అమ్మ. ఈలోగా వసుంధర అక్కయ్య గ్లాసెడు మజ్జిగ తెచ్చింది. అమ్మ చేతిమీదుగా ఆప్రసాదాన్ని అందుకొని సోదరి త్రాగేసింది. ఏం కాలేదు, కాదు. అదే సాధారణంగా మానవులకి అర్థంకాని అసాధారణదైవశక్తి. అది జగజ్జనని అమ్మకి మాత్రమే సాధ్యం. అమ్మ అనుగ్రహమే దివ్యౌషధం. ఎవరికైనా ఏ స్థితిలోనైనా.

మొదటి సారి ఇమిడిన పదార్థం అదే. మూడు వారాల మానసికవ్యధకి, మౌన బాధకి తెర దించింది అమ్మ; అన్నపూర్ణాలయానికి వెళ్ళి అన్నం తినమని కోరింది. అది ఒక దివ్య ప్రబోధం. వారు ముందుగా హైమాలయానికి వెళ్ళి సర్వవిఘ్ననివారిణి హైమక్కయ్యను, శ్రీ అనసూయేశ్వరాలయానికి వెళ్ళి సర్వశివంకరులు నాన్నగారిని దర్శించుకొని వారి ఆశీస్సుల్ని పొందారు. అక్కడ అర్చకులు అభిషేక తీర్థాన్ని పులిహోరప్రసాదాన్ని పంచారు. సహోదరి సందేహిస్తూనే ప్రసాదాన్ని

స్వీకరించింది. వాంతులు, వికారం మాయమయ్యాయి. అన్నం కూడా ఇమిడింది అదీ 18 రోజుల తర్వాత మొదటిసారి. వారి ఆశ్చర్యానికి ఆనందానికీ అంతులేదు.

అందరికీ మంచి చేస్తాననీ, శుభాల్ని గలిగిస్తానని అమ్మ వాచా చెప్పదు, చేసి చూపిస్తుంది. అదే నిజమైన అమ్మ తత్వం. నాటి సాయంకాలం అందరితో పాటు అన్నపూర్ణాలయంలో రుక్మిణి అక్కయ్య కొద్దిపాటు భోజనం చేసింది. రాత్రి వారి గదికి సోదరి యోగక్షేమాన్ని తెల్సుకునేందుకు వసుంధర అక్కయ్య వచ్చింది. రాత్రి బాగా ప్రొద్దుపోయిన తర్వాత అమ్మ కబురు చేయడంతో అమ్మకి వైద్యంచేసే డాక్టర్ ఇనజకుమారి బాపట్ల నుంచి వచ్చింది. జరిగిన దంతా విన్నతర్వాత అన్నాళ్ళు ఆహారం లేని రోగిని తగిన వైద్య సౌకర్యం లేని జిల్లెళ్ళమూడి తీసుకువచ్చినందుకు ఆందోళన వ్యక్తం చేసింది. కానీ ఆహారం లేకపోయినా కులాసాగా ఉండటంతో కొంత సరిపెట్టుకొని, మందులు వ్రాసి ఇచ్చింది.

ఉదయం సుప్రభాతం, సాయంకాలం సంధ్యావందనం కార్యక్రమాల్లో పాల్గొంటూ, అందరింటి సోదరీ సోదరులతో ముచ్చటిస్తూ అమ్మ శ్రీచరణసాన్నిధ్యప్రశాంతతని, ఆనందాన్ని తనివితీర అనుభవిస్తూ ప్రతి నిముషం ఒక మధురక్షణంలా వారు జిల్లెళ్ళమూడిలో ఐదు రోజులు ఉన్నారు. 'అమ్మ నాకు ప్రాణం పోసింది' అని అంటుంది సోదరి రుక్మిణి. అది ఆధ్యాత్మిక పునర్జన్మ. పరమేశ్వరి ఆనంద ధామంవైపు విశ్వాసంతో సాధకుడు వేసే చిట్టి చిట్టిచిట్టి అడుగులు అవే.

తర్వాతకాలంలో ఈ వృత్తాంతాన్ని సోదరుడు మోహనకృష్ణ వారి మామగారికి వివరింపగా ఆయన దీర్ఘాలోచనలో పడ్డారు. వారు జ్యోతిశ్శాస్త్రం తెలిసినవారు. సోదరి రుక్మిణి జాతకరీత్యా ఆకాలంలో ఒకగండాన్ని ఎదుర్కోవల్సింది. పరాత్పరి అమ్మ కలుగజేసుకోవటం వలన అది దాటింది అని ఎంతో ఆనందించారు. రోగ పర్వతదంభోళి, భిషగ్వరేశ్వరి

అయిన లలితా పరమేశ్వరియే అమ్మ. అమ్మకు అసాధ్యం లేదు, అమ్మప్రేమకు అంతంలేదు. జగన్మాత అనుగ్రహరూపప్రసాదాన్ని జగన్మాత చేతులమీదుగా గోరుముద్దలుగా తినాలంటే అది అన్నపూర్ణాలయంలోనే సాధ్యం. కష్టాల కడలిలో కొట్టుకుపోయే వారనేకులు తమ ఆవేదనల్ని ఆర్తనాదాల్ని అమ్మకు నివేదిస్తే అన్నపూర్ణాలయానికి వెళ్ళి భోజనం చేయమని అమ్మ ఒక పరిష్కారాన్ని సూచిస్తుంది. కొందరు 'భోజనం చేసి వచ్చామమ్మా' అని అంటే ప్రసాదంగా కొంచెమైనా తినమని బుజ్జగించేది. అందులో రహస్యం మనందరికీ అనుభవైకవేద్యమే.

## ధాన్యాభిషేకం

ఉపనయన సమయంలో బ్రహ్మోపదేశం చేసేది తండ్రి. తొలి భిక్షను పెట్టేది కుటుంబపోషణబాధ్యత వహించేదీ తండ్రియే. కావున తొలిరోజుల్లో వచ్చేవారికి అన్నం నాన్నగారు పెట్టేవారు; అమ్మ జ్ఞానభిక్ష పెట్టేది. పిల్లలు పెద్దవాళ్ళయ్యాక తండ్రికి ఆసరా అయినట్లు అమ్మ సంతానం వేరే వంటశాల (అన్నపూర్ణాలయం) ని ఏర్పరచుకున్నారు. కనుకనే ప్రతిఏటా ఫిబ్రవరి 17వ తేది, నాన్నగారు ఆలయప్రవేశం చేసిన రోజున, అమ్మకీ నాన్నగారికీ ధాన్యంతో, బియ్యంతో అభిషేకం చేసే సాంప్రదాయాన్ని 1988 లోనే నెలకొల్పారు. ఈ అపూర్వ పూజాకార్యక్రమంలో పాల్గొనటానికి దేశవిదేశాలలోని సోదరీసోదరులు భారీసంఖ్యలో తరలివస్తారు. నాటి ఉదయం శ్రీ అనసూయేశ్వరాలయంలో నిత్యాభిషేక ఘట్టం ముగిసిన తర్వాత కాలేజి విద్యార్థులు, గ్రామస్థులు, స్థానిక, స్థానికేతర సోదరీ సోదరులు అందరూ కలిసి మేళతాళాలతో అమ్మ నామం చేస్తూ వెళ్ళి కళ్యాణమూర్తులైన అమ్మ, నాన్నగార్ల కళ్యాణఅర్చామూర్తుల్ని వాహనంపై ఊరేగించి, కళ్యాణవేదిక పైకి తెస్తారు. పిల్లలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు... అంతా బారులు తీరి తమతో తెచ్చుకున్న ధాన్యం/బియ్యం బస్తాలలోని ఒక భాగాన్ని తీసి వేదమంత్రాల నడుమ అభిషేక కార్యాక్రమాన్ని



ధాన్యాభిషేకం



అన్నాభిషేకం

ఆనందోత్సాహాలతో జరుపుకుంటారు. పూజచేసిన ధాన్యం/బియ్యాన్ని ప్రసాదంగా స్వీకరించి తమ ఇళ్ళలో ధాన్యపు గాదెలలో, బియ్యం డ్రమ్ములలో వేస్తారు. ఆ విధంగా చేస్తే వారి ఇళ్ళలో అన్నం అక్షయం అవుతుంది, అన్న పానాదులకు లోటు ఉండదూ, నాలుగు వ్రేళ్ళూ నోట్లోకి పోతాయ్ అనే ధృఢవిశ్వాసంతో అశేషజనసందోహం ఈ ఉత్సవానికి తండోపతండాలుగా తరలి వస్తారు. బియ్యం ప్రసాదాన్ని వారి వారి బంధువులకు, మిత్రులకు పంచుతారు. ఏటా అన్నపూర్ణాలయ నిర్వహణకి 1000 ధాన్యం బస్తాలు అవసరమని ఒక అంచనా. బిడ్డలు ఆవిధంగా సమర్పించిన ధాన్యాన్ని అన్నపూర్ణాలయనిర్వహణలో ఉపయోగిస్తారు. అమ్మకు అత్యంత ప్రీతిపాత్రమైనది అన్నపూర్ణాలయ సేవాకార్యక్రమం.

ఈ ఉత్సవానికి స్వయంగా రాలేని సోదరులు నగదు లేక వస్తురూపంలో విరాళాలను పంపుతారు. వారికి సంస్థ బియ్యంప్రసాదాన్ని పోస్టుద్వారా అందజేస్తారు. "నీకు రెక్కలు ఇచ్చింది ఎగిరి పోవటానికి కాదు, రానివాళ్ళని ఆదుకోవటానికి" అని అమ్మ ఏకోదరబాంధవ్యాన్ని, బాధ్యతని గుర్తుచేస్తుంది. అది అందరిల్లు. కావున అంతా తమ శక్త్యానుసారం ఈ మహాయజ్ఞంలో పాల్గొని అమ్మ అనుగ్రహానికి పాత్రులౌతున్నారు. మన జీవితం, జీవనం రెండూ ఈశ్వరి ప్రసాదమే. సముద్రంలోని నీరు తీసికొని మరల సముద్రంలోకే అర్ఘ్యం విడిచినట్లు భగవద్దత్తమైన ఐశ్వర్యంలో కొంతభాగాన్ని తిరిగి దేవునికే నివేదన చేయటం ఇందలి పరమార్థం.

## అన్నాభిషేకం

"ఈ కలిలో నాకు ఆకలి లేదు" అని అన్నది అమ్మ. అమ్మకీ మనకీ మధ్య స్పష్టంగా కనిపించే భేదం ఇదే. అమ్మ నిరాహార అయినా ప్రేమతో స్వయంగా వేలాది మందికి అన్నం తినిపించింది, లక్షలాది మందికి అన్నం పెట్టింది కనుకనే అన్నపూర్ణేశ్వరిగా అమ్మను ఆరాధిస్తారు అంతా. సద్గురు శ్రీశ్రీశ్రీ శివానందమూర్తిగారు అమ్మను "కాళి" అని వివరించారు. అమ్మ

నడయాడటం వలన పవిత్రీకృతమైన జిల్లెళ్ళమూడి అవనీస్థలి అయోధ్యా, మధురా, కాశీ.... వలె ముక్తిక్షేత్రం అని సంభావన చేశారు. అంతేకాదు, అమ్మ అనుగ్రహ సమన్వితమైన అన్నప్రసాదంలో ఎన్ని మెతుకులు వ్యక్తి స్వీకరిస్తాడో తన అన్న జన్మలకర్మనశించి, జననమరణచక్రమునుండి విముక్తిని చెంది కైవల్యాన్ని పొందునని ఉద్ఘాటించారు.

జూన్ 12 వ తేదీన అమ్మ తన పరిమితరూపాన్నిత్యజించి, స్వీయ అనంతశక్తి సంపన్నయై జగత్కళ్యాణార్థం ఆలయప్రవేశం చేసిన రోజు. ప్రతిఏటా జూన్ 12వ తేదీన అమ్మను అన్నంతో అభిషేకించమని బోధించారు. అమ్మ చేతిమీదుగా గోరుముద్దల్ని తినే భాగ్యానికి నోచుకోని వారికి ఆ అభిషేక అన్నం మహాప్రసాదమై ఆఫలాన్నే అందిస్తోంది. ఆలయంలో వాస్తవంగా విరాజిల్లేది అచేతన శిలావిగ్రహంకాదు, సృష్టి స్థితిలయ సంచాలక మూలప్రకృతీ సాకారరూపం.

## సర్వత్రా అన్నపూర్ణాలయం

'లక్ష మందికి ఒకేపంక్తిన భోజనం పెట్టమని, ఆ కమనీయదృశ్యాన్ని చూసి తాను పరవశించాలని' - అమ్మ తన అభిలాషను వ్యక్తం చేసింది. ఆ సందర్భంలో పాలకొల్లు ఆడిటర్ గోపి గారు, 'ఇంటింటా నువ్వుకాదా అందరికీ అన్నం పెడుతున్నది? నీకు ఈ కోరిక ఏమిటి?' అనిప్రశ్నించారు. అందుకు అమ్మ, "నేను పెడుతున్నానని నువ్వు చూడటానికి" అని జవాబిచ్చింది.

అందరి ఇళ్ళూ అందరిళ్ళు కావాలి, అందరూ 'అమ్మ'లు కావాలి. అనేది అమ్మ వాంఛ. అన్నపూర్ణాలయం తన గుండె అని చాటింది. ఒకసారి అమ్మ ఒక రుగ్మతతో బాధపడుతోంది. నిజానికి అమ్మకి ఏవ్యాధి లేదు. కానీ బిడ్డల అనారోగ్యాన్ని తీసికొని తాను భరించేది, తాను బాధ పడక పోయినా తన శరీరం నలిగి పోయేది. ఆస్థితిలో అమ్మకి సెలైన్ పెట్టటానికి

## అమ్మప్రేమ మహిమ

"భగవంతునికీ భక్తునికీ మధ్యగల సంబంధం రక్తసంబంధం" అని అమ్మ మాత్రమే ప్రప్రథమంగా ఘంటాపథంగా చాటింది. ఈ నేపథ్యంలో కని, పెంచే అమ్మకీ పోషించే అన్నానికి నడుమ గల అద్భుత బాంధవ్యమహిమను తెలుసుకుందాం.

బాపట్లలో అమ్మ మాతామహులు, శ్రీ చిదంబరరావు తాతగారింట్లో అమ్మ వివాహం జరిగింది. ఆహ్వానిత అతిథులకు సరిపడు విందుభోజన పదార్థాల్ని సిద్ధం చేశారు. ఇల్లు రైల్వేస్టేషన్‌కు దగ్గర కావడం చేత సుముహూర్త సమయానికి రైలు ఎక్కాల్సిన, దిగిన ప్రయాణీకులు కళ్యాణవేదిక చెంత గుమిగూడారు. కొత్త పెళ్ళి కూతురు అమ్మ ఆ అపరిచిత జనసమూహాన్ని విందు భోజనానికి మృదువుగా ఆహ్వానించింది. ఆశ్చర్యం ఆ గుంపులో ప్రతి ఒక్కరు అమ్మ తనని ఉద్దేశించి పలికినట్లు వినిపించింది. కాగా పదార్థాలు వంద మందికి సరిపోతాయి. జనం ఐదువందలమంది ఉన్నారు. దీనితో చిదంబరరావుగారి అంచనా తలక్రిందులైంది. మండువేసవిలో ఎవరైనా నీళ్ళు ఎక్కువగా త్రాగుతారు, అన్నం ఎక్కువ తినలేరని, వండిన పదార్థాలు అందరికీ సరిపోతాయని ఆందోళన చెందుతూన్న తాతగార్కి అమ్మ నచ్చచెప్పింది. వారికి అమ్మయందు ధృడమైన విశ్వాసం ఉన్నా కళ్ళెదుట వాస్తవాన్ని తృణీకరించలేకపోయారు; వెంటనే అదనంగా వంట చేయమని ఆదేశించారు. వడ్డన ప్రారంభమైంది. బారులు తీరి భోజనాలు చేస్తున్నారు. ఎన్నిసార్లు వడ్డించినా తొలుత చేసిన పదార్థాలు అలాగే ఉండిపోయాయి. వార్చిన అన్నం గుండిగెలు పనిలేక పకపకా నవ్వాయి. పెళ్ళిపీటలపై అమ్మ ముసిముసి నవ్వులు విసురుతోంది తాతగారివైపు. ఆయన అవాక్కయ్యారు అదేం చిత్రమో! పిలిచినవాళ్ళూ పిలవనివాళ్ళూ ఎందరు తిన్నా అన్నపు రాశులు తరగలేదు. 20 మానికల బియ్యం 500 మందికి సరిపోయాయి.

మరొక సందర్భంలో కనకమ్మ బామ్మ (అమ్మ అత్తగారు) బోధానంద మరియు అనుభవానంద స్వామీజీలను శిష్యసమేతంగా ఇంటికి భిక్షకి ఆహ్వానించింది. అపుడు అమ్మ ఆ ఇంటి క్రొత్తకోడలు. ఆ సందర్భంగా ఇరుగుపొరుగు కుటుంబాలని కూడా భోజనానికి ఆహ్వానించారు.

వంటకి, త్రాగటానికి సరిపడు నీటిని మున్సిపల్ కుళాయినుంచి తీసుకువచ్చి వేళకి రకరకాల వంటకాలను అమ్మ సిద్ధం చేసింది. ఏభైమంది వస్తారనుకుంటే వంద మంది అయ్యారు. పదార్థాలు అమృతోపమానం అంటూ స్వామీజీలు, వారి శిష్యబృందము తృప్తిగా విందుని ఆరగించారు. వడ్డన చేస్తున్న బామ్మ, ఇతరస్త్రీలు మిగిలిన పదార్థాలు మిగిలినవారికి చాలవని భయపడ్డారు. ముఖ్యంగా సజ్జలతో చేసిన తీపివంటకం సజ్జప్పాలు 60 మాత్రమే ఉన్నాయి. బామ్మ వాటిని విరిచి ముక్కలు చేద్దామనుకున్నది. కానీ హడావిడిలోఒక్కొక్కరికి ఒక్కొక్కటి వడ్డించింది. ఆశ్చర్యం! అందరికి అన్ని పదార్థాలూ సరిపోయాయి. ఆ పదార్థాల రుచి అమ్మ దివ్యమాతృప్రేమ ప్రభావం. ఆ సమయాల్లో వారివారి కడుపుల్ని నింపింది అమ్మవాత్సల్యరసామృతమే. ఈనేపధ్యంలో 50 సం॥లు పైబడి స్వయంప్రకాశమానంగా సాగే నిర్విరామ దివ్య అన్నపూర్ణాలయ రథయానం అమోఘం, అద్భుతం.

1973 సం॥ములో అమ్మ స్వర్ణోత్సవాల సందర్భంగా లక్షమందికి ఒకే పంక్తిన భోజనం పెట్టిన చారిత్రాత్మక సంఘటనకు అన్నపూర్ణాలయం కేంద్ర బిందువైంది. వందల సంఖ్యలో వంట చేసేవారూ, వేలసంఖ్యలో వడ్డించేవారు, లక్షల సంఖ్యలో భుజించేవారూ చూసి తీరాల్సిందే. కాని ఉదయానికి 20,000 మంది మాత్రమే వచ్చారు. ఆశించిన విధంగా అనేక వేలమంది రాకపోతే భారీఎత్తున తయారవుతున్న అన్నపు రాశులు, ఆధరవులు వృధా అవుతాయని నిర్వాహకులు ఆందోళన చెందుతున్నారు. ఎట్టకేలకు ఎప్పటిలాగే సమస్యను అమ్మకు వదిలేశారు. "ప్రాప్తం ఉన్నవారే వస్తారు" అని అమ్మ నిర్లిప్తంగా పరోక్షంగా భరోసా నిచ్చింది. 10 గంటలు





అమ్మ స్వర్ణోత్సవ వేడుకలలోని అన్న ప్రసాదం

దాటాక గుంపులు గుంపులుగా జనప్రవాహం ముంచెత్తివేసింది. అనూహ్యమైన ఆ జనార్ణవాన్ని చూసి కార్యకర్తలు చేసిన వంటకాలు చాలవేమోనని కంగారు పడిపోయారు. మళ్ళీ సమస్యను అమ్మ దృష్టికి తెచ్చారు. బాపట్ల పరుగులు తీసి యుద్ధప్రాతిపదికన అదనంగా బియ్యం బస్తాలు తేవాలని ఆలోచనతో తలమునకలయ్యారు. అమ్మ చిరునవ్వుతో, "జనాన్ని చూసి వంట ప్రారంభిస్తే, అలా ఎందరికి పెట్టగలరు?" అని భావగర్భితంగా ప్రశ్నించింది. ఆ ప్రశ్నకి సమాధానం, ఆ సమస్యకి పరిష్కారం తనవద్దే ఉన్నాయి. మరి అన్నపూర్ణాలయ రథం, రథసారథి, రథాశ్వాలు... అన్నీ తానేకదా!

అందుకే అభయం ఇచ్చింది. హమ్మయ్య అని కార్యానిర్వాహకులు ఊపిరిపీల్చుకున్నారు. అమ్మ స్నానం చేసి సహస్రసూర్యప్రభా భాసమానయై జీపులో బయలుదేరి 13 పాకశాలల్ని సందర్శించింది. స్వయంగా అన్నపు రాశుల్ని పదార్థాల్ని స్పృశించింది. అమ్మకి, గాడిపొయ్యి, వంటకాలకూ హారతి ఇచ్చి ఉత్సాహంగా వడ్డన ప్రారంభించారు. వచ్చిన అసంఖ్యాక ప్రజ తృప్తిగా భోజనం చేశారు అన్నం రాశులు మిగిలే ఉన్నాయి. కార్యకర్తలను చూసి విలాసంగా నవ్వుతూ అమ్మ అనంతశక్తికి దర్పణం పడుతూ. మిగిలిన పదార్థాల్ని ఓంకారనది (నల్లమడ డ్రైన్)లో నిమజ్జనం చేయమని అమ్మ కోరింది. ఆ అద్వితీయ పర్వదినాన సకల జీవకోటికి అమ్మ విందు చేయ సంకల్పించిందేమో! అవతారమూర్తుల చర్యలు సులభంగా అర్థం కావు.

ఆ మహాసంరంభం లో ఒక ముఖ్యమైనపని - పదివేల లీటర్లపాలు కాచి తోడు వేయాలి అప్పట్లో శీతలీకరణసాధనాలు అందుబాటులో లేవు. పాల ఫ్యాక్టరీ నుంచి నీటి తొట్టెలలోనే తెచ్చి బిందెలతో ట్రాక్టర్ మీద తీసికెళ్ళి గంగాళాల్లో పోసి కాచి తోడు వేశారు. అదీ మండువేసవిలో. అమ్మచలనచిత్రంలో ఈ వాస్తవాన్ని స్పష్టంగా చిత్రీకరించారు. ఆ విపరీత పరిస్థితుల్లో పాలు విరుగలేదు, ఆ గడ్డ పెరుగు కమ్మని రుచి అమ్మ దివ్య ఆశీః ప్రభావాన్ని వేనోళ్ళ చాటింది.

అన్నపూర్ణాలయ ప్రసాదరుచి, ప్రభావం అసాధారణం, అలౌకికం. 'ఇంటివద్ద కంచంలో షడ్రుచులతో ఎన్నివంటకాలు తిన్నా, అన్నపూర్ణాలయంలోని పట్టెడు అన్నమే సంతృప్తినిచ్చేది'- అనేది అనేకుల అభిప్రాయం, అనుభవం. కేవలం చింతకాయ పచ్చడీ, చారూ అన్ని చింతలని దూరం చేస్తుంది, పళ్ళ మిరపకాయ పచ్చడి దీర్ఘకాల అల్సర్, గాస్ట్రిక్ వ్యాధుల్ని మట్టుబెడుతుంది. అది జగన్మాత మాతృవాత్సల్య సంపూరితంబైనది, మహిమాన్వితమైనది.

## అన్నపూర్ణాలయ ప్రసాదం - రుచి

ఒకసారి ఒకసోదరుడు అమ్మ దర్శనం చేసుకున్నారు. 'అమ్మ దేవునికి నివేదన చేయబడిన వస్తువు ప్రసాదంగా మారే ప్రక్రియలో దాని రుచికూడా మారుతుందా?' అనే సందేహాన్ని వ్యక్తం చేశారు. అమ్మ చిరునవ్వే సమాధానం. కొబ్బరికాయ కొట్టి అమ్మకి నివేదనచేసి, హారతి ఇచ్చారు. భక్తి శ్రద్ధలతో భాగ్యదేవత అమ్మ వారి నుదుట కుంకుమతిలకం దిద్దింది సకల శుభకామనతో; కుంకుమపొట్లాలు దోసిట్లో పోసింది ఆశీ:పూర్వకంగా; అమోఘ అనుగ్రహ చంద్రికాశీతల జ్యోత్స్నలను వర్షించింది సహజంగా. అలౌకిక ఆత్మానందంతో గుండె నిండగా సెలవు తీసుకున్నారు. తన గదికి వెళ్ళి వీడ్కోలు పలకటానికి వచ్చిన స్నేహితులను కలుసుకున్నారు. అమ్మప్రసాదం కొబ్బరిముక్కలు వారికి పెట్టి తానూ తిన్నారు. ఏమా అవ్యక్త సుమధుర పరిమళం, అద్భుత రుచి అని ముగ్గురూ ఒకేసారి ఆశ్చర్యపోయారు.

ఇక్కడ ముఖ్యమైనదేమంటే ఆయనకి కొబ్బరి అపరిచితమైనదికాదు. వారి ఆహారం అమృతాహారం, అంటే కొబ్బరి, పళ్ళు, పచ్చికూరలూ, గింజలూ. కొబ్బరి ఎప్పుడూ తినేదే, ఎప్పుడోతినేదికాదు. ఆచరణాత్మకంగా వారిసందేహాన్ని అమ్మ నివృత్తి చేసింది. జగద్గురువు అమ్మ లోకానికి పాఠాలు చెప్పేతీరు 'మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్వా' విధానం.

ఇంతకీ యదార్థం అమ్మ మాయతెరచాటుననే ఉంది.

'రసోవైస:' అని అంటుంది వేదం (దేవుని కంటే రుచికరమైన వస్తువు సృష్టిలో లేదు). కనుక అమ్మ, అమ్మప్రసాదం... ఇవే మనకి నిజమైన లడ్లు.

## అన్నపూర్ణాలయం - ఆధివ్యాధులకు చికిత్సాలయం

'అకాల మృత్యుహరణం, సర్వవ్యాధినివారణం, సమస్త పాపక్షయకరం, సకల సంపత్ప్రదం అమ్మదర్శనం, అమ్మపాదతీర్థ అన్నపూర్ణాలయ అన్నప్రసాదం' - అనేది అసంఖ్యాకుల అనుభవం, ఒక ఉదాహరణ

1984లో సోదరుడు మోహనకృష్ణ సకుటుంబంగా అమ్మ సాన్నిధ్యానికి తరచువస్తూండేవారు. అచంచల భక్తివిశ్వాసాలతో. ఆ సం॥ము జనవరి నెల చివరి రోజులలో వారి భార్య రుక్మిణి క్లిష్టమైన అనారోగ్యానికి గురై, ఆకలికోల్పోయి, ఆహారం లోపలికి పోక, బలవంతాన తీసుకుంటే వాంతి అయి... వైద్యునికీ అంతుపట్టని సమస్య అయింది. ఎన్ని పరీక్షలు చేసినా ఏదోషం కన్పించలేదు. మరి ఏమని నిర్ధారణచేస్తారు? ఏవోమందులు వాడారు. ఫలితంలేదు. పోనుపోను మజ్జిగ మంచినీళ్ళు కూడా ఇమడని ఆందోళనకర పరిస్థితి ఏర్పడింది. హైదరాబాద్‌లో వారి ఇంటి డాక్టర్, నిపుణులైన డాక్టర్ల బృందం రోగ నిర్ధారక పరీక్షల నివేదికలను పరిశీలించి దోషం ఎక్కడా లేదని తేల్చారు.'అమీబియాసిస్' అని ఊహించి మందులు వాడారు. వైద్యశాస్త్రం తన ఓటమిని అంగీకరించింది. ఒకటికాదు, రెండుకాదు పద్దెనిమిది రోజులు ఉపవాసం చేసినట్లయింది. అన్నంతినటంకాదు, అన్నం మెతుకు చూసినా, వాసన చూసినా వికారం కలిగే విచిత్ర అయోమయ పరిస్థితి నెలకొంది. ఆ స్థితిలో ఎవరైనా ఏంచేయాలి? ఎక్కడ మానవ శక్తి నిష్ఫలమూ నిష్ప్రయోజనమూ అవుతుందో అక్కడ దైవ బలాన్ని అర్థిస్తాం.



## జిల్లెళ్ళమూడిలో జరిగే ముఖ్య కార్యక్రమాలు :

| | |
|---|---|
| జనవరి 1వ తేది | న్యూ ఇయర్ డే |
| ఫిబ్రవరి 17 | శ్రీ నాన్నగారి ఆరాధన - ధాన్యాభిషేకం |
| చైత్ర శుద్ధ ఏకాదశి | అమ్మ జయంతి - అనసూయావ్రతాలు |
| మే 5 | అమ్మ కళ్యాణదినోత్సవం, ఉపనయనాలు |
| జూన్ 12 | అమ్మ ఆలయ ప్రవేశం, అన్నాభిషేకం |
| ఆగష్టు 15 | అన్నపూర్ణాలయ వార్షికోత్సవం |
| అక్టోబరు | నవరాత్రి విశేష పూజలు |
| కార్తీక బహుళ షష్ఠి | శ్రీ హైమవతీ దేవి జయంతి-లలితా కోటి నామ పారాయణ |
| డిసెంబర్ 25 | క్రిస్మస్ |

### నిత్యార్చన, అభిషేక, నిత్యహోమ కార్యక్రమాలతో పాటు

- ఆలయాలలో ప్రతి సోమ, శుక్రవారాలు లలితాసహస్ర లక్షనామార్చన.
- శుద్ధ ఏకాదశి నాడు అనసూయ వ్రతం, బహుళ షష్ఠి నాడు శ్రీ హైమవతీ వ్రతం.
- పూర్ణిమ నాడు శ్రీ హైమనామ ఏకాహం.
- ప్రతి నెలా 12వ తేది రాత్రి అమ్మ సంకీర్తన, మహా హారతి.
- బహుళ చవితి నాడు సంకటహర గణపతి హోమం, అభిషేకం. నెలలో ఒక ఆదివారం నాడు మహా సౌర హోమం నిర్వహింపబడతాయి.

ఆసక్తి గల వారెల్లరూ పాల్గొనవచ్చు.

## జిల్లెళ్ళమూడి ఎలా చేరుకోవాలి?

గుంటూరు జిల్లాలో విజయవాడ - చెన్నై రైలు మార్గంలోని బాపట్లకు 14 కి.మీ. దూరంలో జిల్లెళ్ళమూడి వుంది. బాపట్ల రైల్వే స్టేషనులో దాదాపు అన్ని ఎక్స్‌ప్రెస్ రైళ్లు ఆగుతాయి. రోడ్డు మార్గంలో అయితే గుంటూరు నుండి చీరాల వెళ్లే బస్సులో బాపట్లలో దిగాలి. బాపట్ల రైలు స్టేషను నుండీ, బస్టాండు నుండీ జిల్లెళ్ళమూడి చేరుకోవటానికి ఆటో రిక్షాలూ, కార్లు దొరుకుతాయి.


మిగతా వివరాలకు సంప్రదించండి.

రెసిడెంట్ సెక్రటరీ

శ్రీ విశ్వజననీ పరిషత్

జిల్లెళ్ళమూడి - 522 113.

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్,

ఫోన్ : 08643-227324, 227492

E-mail:svjp.amma@gmail.com

Website:www.viswajanani.org

www.motherofall.org




ఆంగ్లమూలం
ఎస్. మోహనకృష్ణ

స్వేచ్ఛానువాదం
ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం


(ఈ గ్రంథ ముద్రణకై ద్రవ్య సహాయం చేసినవారు

శ్రీ పి. బాబూరావ్, మేనేజింగ్ డైరెక్టర్, కాంతి కన్‌స్ట్రక్షన్స్, హైదరాబాద్ - రూ॥5,000/-

కీ॥శే॥ మామిడాల శ్రీహరిరావు గారి జ్ఞాపకార్థం వారి సతీమణి శ్రీమతి హైమవతి - రూ॥5,000/-




Proposed new building for Annapurnalayam


Designed & Printed by Janani Visual Communications, Hyd. Tel : 9849180889